# విషయ సూచిక

# మొండికాపరం

అయితే ఎన్నాళ్ళండి యీ చింకిగుడ్డలతో ఇలా ఉండటం నేటికి నెల్లాళ్ళయింది విధిమొగం చూస్తే ఒట్టి ఛీ, ఒళ్ళు చచ్చిపోతుంది దిక్కుమాలిన బ్రతుకు" అంది కళ్ళంట నీళ్ళు నింపుకొంటూ లక్ష్మి

'నిజమే నాకు తెలియదంటావా నీ అవస్థ? కాని సంసారంలో నీకు తెలియని విషయం ఏముందో చెప్పు పోని మరి యీ నెల్లో యీ తద్దినాలు రెండు పెట్టాలికదా ఎట్టి కని చాలుతుంది యీ జీతం" అన్నాడు సముదాయిస్తూ, సగం చచ్చిన దీనస్వరంతో వెంకటేశం

తన అసమర్థతని సమర్థించుకోడానికి, ఆమె గొంతులో గొంతు కలిపి వడవడను అతడీమధ్య సంపాదించిన శక్తి పాపం ఆమెకి బట్టలు లేవన్న దుఃఖానికి భర్తని మరింత బెంబేలు పెడుతున్నానే అన్న దుఃఖం తోడైంది

భర్తమాటలకి ఆమె నిట్టూర్పే సమాధానం

పైటచెంగుతో కళ్ళొత్తుకుని "బాకీలు తీర్చాడానికి యిరవై రూపాయిలేనా మిగిలేయి? మరి తద్దినాలు రెండింటికీ అరకుంచెడైనా అవుతాయిగాని మానవుగదా మిగిలినదాంతో యీ నెలాఖరుదాకా ఎలా గడపటం" అంది — ఏమీ పాలుపోని, బెంగతో నిండిన మొఖం మీదికెత్తి

'అవును రెండు తద్దినాలు ఒకే నెల్లో తగలడ్డాయి కానీ, ఏం జేస్తాం? ఆ భగవంతుడే ఉన్నాడు' అన్నాడు వెంకటేశం

ఆపాటి ఆశ అనేదే వాళ్లని అలా కొనఊపిరితోనైనా యీ భూమ్మీద నిలపెట్టింది

వెధవ తద్దినాలు మానేస్తే బాగుండును అనిపించింది వెంకటేశం మనస్సులో కాని ఆ మాట పెళ్ళాందగ్గరకూడా బాహాటంగా అనడానికి అతనికి ధైర్యంచాలిందికాదు అవును బ్రతికినవాళ్లకేం ? ఓనాడు లేకపోతే మరోనాడైనా తింటారు ఇంతకీ ఓనాడు పస్తుంటే చచ్చిపోరుగదా చచ్చినవాళ్లకీ ఏడాదికి ఓసారైనా ఓ ఇన్ని నీళ్ళొదలద్దూ ?

అయితే రేపేగదా మీ నాన్నగారి తిథి మారేదో బజారెళ్ళి రాకూడదూ" అంది లక్ష్మి దరిద్రంఅంతా మరచి పోయి

సరే అంటూ లేచాడు వెంకటేశం కావలసిన సామగ్రి ఏదో చెప్పి సంచి చేతికిచ్చి వీధిగుమ్మందాకా సాగనంపి వెనక్కి మరలింది లక్ష్మి

బుర్ర వంచుకు నడుస్తూన్న వెంకటేశం, బుర్ర చింపుకొని ఆలోచిస్తున్నాడు తన సంసారాన్ని సమీక్షిస్తూనూ

"పాపం, లక్ష్మి కోరిందేమిటి గనక కట్టుకోనేందుకు ఓ చీరగుడ్డ చీరేమిటీ, పదిమూళ్ళ పంచ ఆపాటి కొనలేక పోయాక ? ఎందుకీ మగతన, ఈ నౌకరీ యీ బ్రతుకు ? నా, నాడెమా ! ఏమి కోరిందని లేదనటం, ఎంత అమాయకు రాలు మరోపాటిదైతే యీ పాటికి సంసారాన్ని నడివీధికెక్కించేసేదూ "అని ఏమేమో సముద్రతరంగాల్లో ఆలోచనలు ఆ [illegible] గిర్రున తిరుగుతున్నాయి అతని కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగేయి అతడు ఆ సందుమలుపు తిరిగేడు

'ఏమండోయ్? వెంకటేశంగారు! ఏమిటెక్కడా కన
పడ్డం మానేశారె' అన్న ఒడగొంతుకు అమాంతంగా
వెంకటేశం ఆలోచనాతరంగాల్ని అణగార్చింది. వంచినబుర్ర
ఎత్తిచూచేడు వెంకటేశం. రామారావు ఎదురుగా వచ్చి
నిల్చేడు.

'ఓహో! మీరా!' అన్నాడు వెంకటేశం. ఆ మీరా
దేమిటనాలో అతనికి తోచలేదు.

రామారావుని చూడగానే వెంకటేశంగుండె శీఘ్రంగా
కొట్టుకొంటూంది. అతనికి అంతా తడపాటుగానే ఉంది.

'మీ యింటికే వస్తున్నాను. ఏదీ మా పదిహేను
రూపాయిలు మూణ్ణెల్లయింది' అన్నాడు రామారావు.

అనుకొన్నంత అయింది. ఎదురుపడ్డదగ్గరనుంచీ వెంక
టేశం, అనుమానించి భయపడుతూన్న విషయమే ఇది.

పాపం, రామారావు ఎంత మంచివాడు. అతనావేళ
ఆ పదిహేను రూపాయిలు యివ్వకపోతే సరోజ బ్రతికిఉం
డేదా? పిల్లని మృత్యుముఖంలోంచి తప్పించిన పుణ్యాత్ముడికి
అతడిచ్చిన సొమ్ము అతడికివ్వడానికి యిన్నాళ్ళు తిప్పడమా
అనిపించింది వెంకటేశం మనస్సులో.

అయిన ఆలస్యం ఎలాగా అయింది. మరో రెండురోజు
లాగితే ఏంపోయె మనమేం ఎగవేశేద్దాం అనుకోలేదే అని
మరెవ్వళ్ళో సలహా యిస్తున్నట్టుగూడా ఆ మనస్సులోనే వి
పించింది.

'క్షమించండి కొంచెం ఒడుదుడుకుగా ఉండి చెల్లించ
లేకపోతూను ఈ నెలాఖరిని తప్పకుండా యిచ్చేస్తాను"
అన్నాడు వెంకటేశం ఋణదాతతో

"చాల్లెండి అయిన మూడు నెలూ కాక యీ నెలా
ఖర్నిగాడా అనడం ఏం పెద్దమనిషితనం అని అ అ- అంత
వరకు ఆగడం జరగదు సార్ మరేదో చేసి యీవాళ యిచ్చే
యవల్సిందే' అన్నాడు రాఘవరావు కొంచెం గొంతుక శ్రుతి
హెచ్చించి

"క్షమించండి అప్పుడు అక్కువడి ఆపదలోంచి గట్టెక్కిం
చాక మీ మేలు మరువలేను ఒక్క రెండురోజులు గాగండి!
అన్నాడు వెంకటేశం కృతజ్ఞతా దీనత్వం అసమర్ధత, అన్నీ
వెలిబుచ్చుతూ

ఏం మాటలండీ మీ అవసరాల్లాటవి కావుటయ్యా
మావి అన్నాడు రాఘవరావు, మరీ గొంతుక హెచ్చించి

దారిబోతూన్నవాళ్ళప్పుడే ఏమిటో అని నిలబడి వినే
స్తున్నారు యీ రామాయణం యీవత్తున్నా వాళ్ళకి
మరేం పని లేనట్టు వీళ్ళు కదిల్తేనే కాని మేము కదలం అని
శపథించుకున్నట్టున్నారు వాళ్ళలో కొందరు

నలుగురూ చేరుకొంటుంటే ఋణదాత స్వరం తారస్థా
యికి చేరుకుంటూంది

"పిల్లకి ప్రాణంమీదికొచ్చాక ఆపత్కాలంలో అప్పిస్తే
ఎగేయటం ఏమి ధర్మం" అని ఒకాయన

'ఇంతేనండీ యీ రోజుల్లో పుణ్యానికెల్తే పాపం ఎదురు'
అని యింకొరు

'మంచీచెడ్డా తెలిసిన మర్యాదస్తులకే ఈలాటి పోగాల మైతే మరి కలికాలం కాదూ వరోహాచు

వెంకటేశం యీ అనవసర పంచాయతీ వినలేక పోయాడు అతడూ ఓ పెద్దమనిషే మానం మర్యాదా కావల సినవాడే పదిమందిలో 'జాకీఉన్న వ్యక్తి' అన్న బిరుదు అతడు సహించలేక పోయాడు నేనూ ఓ ఉద్యోగస్తుణ్ణే అన్న అహంకారం కాడా అతణ్ణి యీ మాటలు మరి వినని చ్చిందిగాదు నడివీధిలో మంచంత మనిషి మరోమనిషిని కాళ్ళట్టుగా బతిమాలటం అసందర్భం అనిపించింది కాక అతడికాకీ అతడి చెప్పె చిరంధర్మం అనిపించింది జేబులో డబ్బున్నదన్న సంగతి స్ఫురించింది అప్రయత్నంగా జేబులోకి చెయ్యికూడా వెళ్ళింది

'సరే మీరంటె పట్టుదల పట్టేక నేనేమనేది ఇదుగో యిందండి మరో ఖుద్ది డి రెండురోజులాగవలసిందని కోరాను పోనీ మరోలా తెచ్చుకుంటాం అంటూ పదిహేను రూపా యీలు రామారావు చేతిలో పెట్టేశాడు వెంకటేశం

"దగ్గరుండేనా లేదన్నారు! లేకుండా ఉండి" అంటూ, సొమ్ము చెప్పేశాడన్న సరోవమైనా వెలిబుచ్చకుండా చూశా రా ఈయన పెద్దమనిషితరహా అన్నట్టుగా చుట్టూ ఉన్న వాళ్ళ వేపు చూస్తూ గిరుక్కున తిరిగి తన దోవ తాను పట్టేడు రామారావు

నవ్వుతూ కొందరూ వ్యాఖ్యానిస్తూ కొందరూ చల్లచల్లగా అందరూ అక్కడినుంచి జారిపోయారు వాళ్లు రామారావుకోసమే వచ్చినట్టు అతడు వెళ్ళిపోయాక మరి

వాళ్ళకక్కడ నిమిత్తం లేనట్లు ఎక్కడివాళ్ళక్కడే పటాపంచలయిపోయారు

అయిదునిముషాల్లో వీధి అంతా శూన్యం వెంకటేశం జేబు శూన్యం

వెంకటేశం విరసముఖం పెట్టాడు బజారుకెళ్ళి చేసే పనేమీ లేదు యింటికే వచ్చేశాడు మొఖం వేళ్ళవేసి

చేతిలో సంచి తేలిగ్గానే ఉంది జేబు మరీ తేలికయింది చేయవలసినపనికూడా తేలికయింది గాని వీటన్నిటివల్లా వెంకటేశం గుండె బరువెక్కింది కళ్ళల నీటిపొరతో, ఎండిన మొఖంతో, లాక్కుపోయిన కాళ్ళతో, నట్టింట్లో కూలబడ్డాడు వెంకటేశం

"ఇప్పుడే వచ్చేశారేం?" అంటూ పెరట్లోంచి లోపలికి వచ్చినలక్ష్మి, ఉత్తసంచీ నేలపారేసి నిలువునా కూలబడ్డ భర్తని చూసి నిర్ఘాంతపోయింది అతడిని ఆ అవస్థలో చూసి ఆమె దుఃఖం పట్టలేకపోయింది తనూ ఆ పక్కనేవచ్చి కూలబడింది

అలా ఆ యిద్దరూ ఎంతోసేపు కూర్చున్నారు జరిగిన దానికి వాళ్ళు విచారించలేదు ముందు గతేమిటని వాళ్ళు ఆలోచన ఒకరి కొకరు తుడుచుకోవటం మినహా వాళ్ళకి మరోపని తోచలేదు

"నాన్నాలూ, కాసీ యియ్యాలూ, పీపా కొనుక్కుంటాను" అంటూ రివ్వున పరిగెట్టి, ఎక్కణ్ణుంచో వచ్చి వెంకటేశం వడిలో వాలింది సరోజ

అంత ఏడుపులోనూ అతడికి నవ్వు వచ్చింది. ఎల్లని చూసి, ముఖ్యంగా కానీ అడగటానికి యీ పిల్లకికూడా యిప్పుడే బుద్ధిపుట్టాలా? ని అనిపించింది.

"రేపు కొందాములే యీవాళ కానీలు లేవమ్మా" అన్నాడు మళ్ళా అతని దుఃఖం పొంగువచ్చినట్టు వచ్చింది.

రివ్వున పారిపోయింది సరోజ మళ్ళా వీధిలోకి. ఓయ్, అబ్బ యీవాళ కానీలు లేవు రేపు ఒత్తావు కదూ అన్న సరోజ కేక తల్లిదండ్రులిద్దరూ విన్నారు.

'సరూ! యిలా రా!' అంటూ కేకేసింది లక్ష్మి. వెధవకానీ! ఈ పాటి లేదంటే ఎంతైనా నవ్వరూ లేదన్న దుఃఖం కంటె లేదనుకుంటారేమో అన్న దుఃఖం ఆమెనెక్కువ పీడిస్తూ ఉంటుంది.

సరోజ లోపలికి వచ్చింది. తల్లి కొడుతుందేమో అని తండ్రివళ్ళో వాలింది. ఆమెను బుజ్జగిస్తూన్న తండ్రికి అకస్మాత్తుగా ఓ వెలుగు గోచరించింది. గుండె దిట్టపడింది.

"సరూకి లోలక్కులు తాకట్టు పెట్టేస్తే" అన్నాడు వెంకటేశం భార్య ఆమోదాన్ని ఆశిస్తూ.

"తాకట్టుపెట్టి విడిపిస్తారా ఏమైనానా? తెగనమ్మే యాండి" అంది నిట్టూరుస్తూ లక్ష్మి.

భార్యకి కోపం వచ్చిందనుకున్నాడు వెంకటేశం. నిజమేను సంసారం చేస్తూన్న ఎనిమిదేళ్ళకి ఒక్కగానొక్క ఆడపిల్ల వరప్రసాదంలా పుట్టతే దానికేమీ పెట్టేది లేదుగాని దాని చెవులనున్న లోలక్కులుగూడ తీసెస్తాననడం ఏమిధర్మం? అవి తనేమైనా చేయించాడా? అది పుట్టినప్పుడు బ్రతికిఉన్న

# యీ అనుభవం చాలదా!

౧

ఆ మిల్లు చల్లగా ఉండాలి — అప్పటికే కల్లుపాకలో ప్రవేశం ఉంటుంది ప్రొద్దల్లా చెమటోడ్చి గడించిన నాల్గు డబ్బుల్లోనూ చుట్ట కొనుక్కుపోను — మిగిలినదంత ఆ పాకలో నైవేద్యంపెట్టి ప్రసాదం ఆరగించడం అతగాడి పరిపాటి కండలు దిరిగే యౌవ్వనంలో కల్లూ బుడ్డీ నతడారాధించేడు అప్పటినుంచీ ఇప్పటిదాకా అవిచ్ఛిన్నంగా అనుదినం అతడా పూజ చేస్తూనే ఉన్నాడు పని కెంపుపెట్టిన రోజులు కొన్ని ఉన్నాయి గాని కల్లుపాకకిపోని రోజు మాత్రం లేదు అతడి కలాట భక్తి కుదిరింది

అతడు చదువుకో లేదు ఆ విచారమూ అతడికి లేదు కాని త్రాగినప్పుడతనికి వాగ్ధాటి వస్తుంది కవిత్వమూ పుడుతుంది అతడు నాట్యం నేర్చుకున్నాడో ఏమోగాని రోజూ పాకనుంచి యింటికెళ్ళేదాకా నాట్యం చేస్తూనేఉంటాడు అతడు పాడితే అతడికే ఆనందం గుక్కతిప్పకండా తిట్టడం అతడు నేర్చిన అమూల్యమైనకళ

రోజూ ఆమెతో అతడు దెబ్బలాడతాడు ఒక్కొక్కప్పుడు ఆమెను కొట్టడంకూడా కద్దు ప్రతి సాయంత్రమూ వారికి తగవులాట తప్పనిసరి రాత్రి ఎప్పుడో రాజీ అవుతుంది ఉదయం యిద్దరు కలసాగానే యిల్లు బయల్దేరతారు

ఆమెకూ కొంత గడనశక్తి ఉంది ఉదయాన్నే పట్నం పోయి కూలిచేసి కొంత యింటికి తెస్తుంది పొయ్యిమీద కుండ

పెట్టే శక్తి ఆమె స్వార్జితానికే ఉంది అతడు డబ్బు తెచ్చాడు గాడని ఆమె విశ్వసించదు అతడికి అమర్చిపెట్టడమే ఆమె లక్ష్యం అతడు త్రాగుతున్నాడని కాదు ఆమె కోపం త్రాగి ఆరోగ్యం చెడగొట్టుకుంటున్నాడని అతడిచేత వీపు సాపు చేయించుకోవటం ఆమె అలవాటయిపోయింది అతన్ని ఈపని మానమని చెప్పటం ఆమెకి పరిపాటయింది

## ౨

ఆమె ఆ రోజు కూలికి పోలేదు కాలాడిగాని కడు పొడదు అతడు సాయంత్రం ప్రస్తుగా పుచ్చుకొని వచ్చాడు రావడమే తడవుగా వడ్డించమన్నాడు వంటలేదన్న సంగతి విని అతడు కంటగించుకొన్నాడు అంతగా త్రాగేం రాకపోతే కొంతైనా యింటికి తేరాదా అంది ఆమె తన త్రాగుడు విషయంలో నిరోధించి ప్రతిఘటించడం అతడి మగతనానికే అవమానం అని అతడి ఉద్దేశ్యం

‘నూడు యీపాలి ఆ వూసెత్తేవంటే వీపు చెక్కలవుద్ది ”

“అవును మరేటి చెయ్యాలి పోనీ నాకెనేటి బాధ చల్లగా కొంగో తింజాగొత్తాదో నానూ నూత్తాను ”

“నువ్వేనేటి గడించేత్తున్నావు నాకు తిండి నానంత చేతగాని యెదవననా నీ అభిప్రాయం ”

“ లేదు చేతనైనోడివే రోజూ నువ్వు తెచ్చిన గింజలే తింటుండాను సిగ్గులేకపోతే సరి తినలేదనుకోటం ”

"ఓసి ముండా ఓరికే సిగ్గులేదు నే మొగాణ్ణి నా యిట్టం వచ్చినట్టు నాను తిరుగుతాను తింటాను తాగుతాను నీ ఆటంకేమేటి నాకు"

"ఏ ఆటంకవుూం నేదు తాగు ఏ రోగంవో ముంచు కొచ్చినాడు తెలుత్తాది ఆ మొగతనం"

"ఏటన్నావూ! నాకు రోగం రావాలా! ఛీ పాడు ముండా! నీకే రావాలయ్యన్నీని"

"నాకేటొత్తాది ఏ పాయ్యోకాలమో నీకేప్పుట్టాలి"

"ఛీ యెదవా అంటూనే ఇంతసా ప్రక్కనే ఉన్న ముద్దు విసిరేడు ఆమె మొగ నూటిగా తగిలిందా దెబ్బ ఏడుపుతో పాటు శరపరంపరలు తిట్లు ఆ నోటంటా గంగాప్రవాహంలా వచ్చేస్తున్నాయి అతడు చెయ్యి సద్దుకున్నాడు తిట్టుకో గుద్దు గుద్దుకో కేక కేకకో దెబ్బ అవినాభావసంబంధంగా నడిచేయి

ఇరుగుపొరుగువాళ్ళంతా పోగయ్యేరు అదీ మామూలే కాని ఆ రోజు తిండిలేకపోవడం అతగాడి కోపాన్ని ద్విగుణీకృతం చేసింది తగువు చెప్పడాని కొచ్చినవారిమీద అతడు విరుచుకుపడ్డాడు మాటకు మాట వచ్చినవాళ్ళలో ఓ పెద్ద మనిషితో అతనికి గుద్దులాట ఆవశ్యకం అయింది పదిమందీ పోగయ్యారు ఒకడు పోలీసుని కేకేసేడు

అక్కణ్ణ ఠాణాలో పెట్టేసు (తాగి యింట్లో పెళ్ళాన్ని వీధులో పెద్దమనుష్యుల్ని కొట్టాడనే నేరంతో అతడికి సుఖాయాసంగా మూడు నెలలు విశ్రాంతి కల్గించింది ప్రభుత్వం శిక్ష జెప్పి

"గొడ్డు గోతబడితే తలో బెడ్డా" అనుకొంది ఆమె తాగివచ్చినప్పుడేదో తగువులాడేవాడు కాని మామూలప్పుడు అతడెంత మంచిగా వుండేవాడో అది ఆమెకే తెలుసు

ఆమె వారి మాటలు పట్టించుకోలేదు అహర్నిశాలు అతడే ఆమె కిప్పుడు కళ్ళకు కట్టినట్టు కన్పిస్తున్నాడు అతడితో వివాదపడిన ఘడియలుకూడా ఆమె కిప్పుడు జ్ఞప్తికి వస్తున్నాయి అన్నిట్లోనూ తనదే తప్పని ఆమెకు అనిపిస్తోంది చివరకు ప్రతిసాయంత్రమూ ఆమె దుఃఖం వెలుపలా స్తూ ఉండేవి అతడి ది లుపాతకె పోయే వేళ ఖైదులో అతడా సమయంలో ఎంతో దుఃఖిస్తాడని అనుకొన్నప్పుడు ఆమె దుఃఖం పట్టలేకపోయింది

ఆమె మళ్ళా కూలికి వెళ్తోంది ఈసారి ఆమె మరి కొంచెం ఎక్కువ కష్టపడుతోంది తక్కువ తిని మిగులుస్తోంది మిగిల్చిన డబ్బు రో జూ లెక్కపెడుతోంది ఇంతేనా అని విస్తుపోతోంది

ఇప్పుడామె పూనిన ప్రయత్నం అతగాడు రాగానే సంతోషపెట్టాలని జైలులో అతడికి కల్లు దొరకదు తిండి బాగోదు అతడు వీటికి మొఖంవాచి యింటికి వస్తాడు వచ్చే సరికల్లా "నీ యిష్టం వచ్చినంత తాగు ఈ డబ్బుట్టిగెల్లు అని చెప్పి గడి చివ దతని కద్దామని ఆమె ఉద్దేశ్యం ఇంటికి వచ్చిన నెల్లాళ్ళదాకా అతడు పనిలోకి పోలేడేమో ఆ రోజుల్లో అతడికే లోపమూ లేకుండా చూడాలని ఆమె ప్రయత్నం అందుకే ఆమె చెమటోడ్చి గడిస్తోంది లెక్కవేసి ఖర్చుపెడతోంది రోజులు గుణిస్తోంది అతడి రాకకి ఎదురుచూస్తోంది

"మనసు బాగాలేదు ఇవ్వాడెక్కడికి కెళ్లాలేవి ఈ డబ్బెందుకు" అన్నాడు అతడు

'ఓన మరచిపోనావేటి అన్నీని అయితే మరి మంచిదే గందా యింద యివట్టికెల్లి తాగు అది

అతడా మాట విని తెల్లబోయినట్టు చూసేడు ఆమె వేపు అతడి కళ్ళల్లో నీళ్లు తిరిగాయి

"జైల్లో కల్లెట్లా వత్తాది ఆ అలవాటు యింది మరి చేసుకోను ఈ అనుభగం సాలదా" అన్నాడు ఆమె వింత బోయి చూస్తూ అంది 'నిజమేనా నన్ను సంప్రుకు తిన్నట్టే అంది

అతడు మరేం అన లేదు కన్నీళ్ళు తుడుచుకుంటూ ఆమెను చేరదీసుకొన్నాడు

---

# గుడ్డి మా లోకం??—

అంధత్వం అతగాడి ప్రారబ్ధం అంటమాత్రాన్ని అతను మనాడు నావనగ్గ్రె నగాడైవను

ఆమెమీద అతడి సగానుభికారం ఉంది అతను కదలను మెదలక ఆ వెన్ను ఏకిరిందటి పుట్టుకలోనో అతడికియు పడిఉంది అతడా పోటు ఆకళింపుచేసు ఆ పరిదేశంలోకి మనో ప్రాణి రావడం అతగాడికి ఇటుకు కబడకుండా పరివేశించే నాపైమీదగానె, తొగి తొంగి చూసే నూర్యచంద్రుల మీదగాని, అతను పగలేను గాని మనో మతరుడికి అక్కడికి ప్రవేశంలేదు

అతడిలో ఓ శక్తి ఉంది ఆమె తెచ్చిన దాంట్లో కొంత అనాయాసంగా ఆరగించడమనేదే ఆ శక్తి ఓ కర్తవ్యం కూడా ఉంది ఆమె ఎప్పుడేనా ఆలస్యంగా వస్తే అతగాడికి కసరవలసిన పని ఉంటుంది అతడికి ఓవాంచ ఉంది చుట్టగాల్చకుండా అతడికి తెల్లారదు అది లేకపోతే అతగాడు ఆమెమీద ఉగ్రుడయిపోతాడు అతడూ ఓ వేదాంతే తను గుడ్డివాడై తేనేం భగవంతుడు గుడ్డివాడుకాడు అదే అతని నమ్మకం బ్రతికి ఉండడానికి కాధారమున్ను

ఆమె అతనిదగ్గరే ఉంటుంది అతగాడికి కావలసింది అందిస్తుంది పూళ్ళోకిపోయి సాధిస్తుంది అడిగినవాళ్ళనే అడుగుతుంది ఎక్కిన గుమ్మమే ఎక్కుతుంది వెళ్ళినచోటికే వెళ్ళుతుంది ఆమెకు విసుపులేదు విరామమూలేదు ప్రొద్దుట

లేచి వూళ్ళోకి పోతుంది పొద్దుపోతూఉంటె చెట్టు క్రిందికి మరలుతుంది

ఈ నిత్యయాత్రలో ఆమె అంతా ప్రాతే అంతా క్రొత్తే గతంతో నిమిత్తంలేదు ఆ గతం గురించి ఆశా లేదు

ఆమె వట్టి వర్తమానజీవి ముప్ఫైరూపాయిల మష్టి ఉద్యోగస్థుణ్ణి మూడు దమ్మిడీలే అడుగుతుంది ముప్పైలక్షల షావుకారునీ మూడు దమ్మిడీలే యాచిస్తుంది

అదే ఆమె కనీసపుకోర్కె అందుకోసం ఆమె వ్యక్తిగతంగా ఆందోళన ఎంతైనా చేస్తుంది గాని సమ్మె కట్టదు

దొరికినదాంట్లో అతడికో కొంతపెట్టి తనోయింత తిని ఆమె విశ్రమిస్తుంది రోజూ అతడికో చుట్టతెచ్చి యిస్తూ ఉంటుంది అది కాలుస్తూ అతడు మాట్లాడినప్పుడు పగలంతా తను యాచించడంలో అనుభవించిన కష్టాలు ఆమె విస్మరిస్తుంది ఆలాగైతే ఆమెకి సూర్యుడు ఆశాజనకంగా ఉదయిస్తాడు అతగాణ్ణామె కంట్రగించుకోదు అతడి గురించి ఆమె జాలిపడుతుంది అతణ్ణి సంతోషపెట్టడానికి ప్రయత్నిస్తుంది

అంతా అనుకుంటారు ఆమె చక్కనిదని నిజమే ఆమె చక్కనిదేను తగిన బట్ట కట్టి కూచోపెడితే చేరడేసి కళ్ళు, ఉంగరాల జుత్తు సలాకలాటి శరీరంతో ఆమె బంగారు బొమ్మలా ఉంటుంది

అయితే ఎవరూ యింతవరకూ అలాచేసి ఆమెను కూచోపెట్టలేదు అందరిదీ ఊహాగానమే

అతడికోసం ఆమెకీ తాపత్రయం ఎందుకూ? అని కొందరి మతం ఆ గుడ్డిగాడ్నొదిలిపోతే దీనికి గడవకపోయిందా అని వాళ్ళ తర్కం

అవును అన్నీ ఉన్నవాణ్ణే విడాకుల చట్టం ప్రకారం బహిష్కరించేస్తూ ఉన్న ఈ రోజుల్లో, అంగహీనుణ్ణి ఆడది అంగీకరిస్తుంది? ఆపాటి తెలుసుకోకుండా ఉండడం ఆడదాని ప్రారబ్ధం ఆమెకేం అంత బాధ? అతగాడికి చుట్ట సంపాదించేటంతవరకు! చీరా, నారా, నగా! నాణెమూ! ఏమీ లేదామె పైగా యాచించి తెచ్చిన దాంట్లో పేరగా కూచో మెక్కడం తప్పించి ఏ పనీ చేతగాని ఈ పీనుగు ఈమె కెక్కడ దాపరించాడూ! ఇదీ కొందరి వాదం

ఎవరేమన్నా, ఆమెకు మాత్రం అతడంటే ఎంతో అభిమానం అతగాడిమీద ఆమెకిఉన్న జాలి భగవంతుడికికూడా లేదేమో అతడేమీ ఆర్జించడన్న సంగతి ఆమెకు తెల్సు మరోచోటికిపోతే తనకీ మంచిదేనన్న సంగతి ఆమెకు తెలుసునో తెలియదో అదే సందేహం

ఒక్కొక్కనాడు వాళ్ళలో కలహం పుట్టుతుంది ఇద్దరూ తిట్టుకుంటారు అప్పుడప్పుడు ఆమెకా సమయంలో అతగాడి నోటంట వినరానిమాటలు దుడ్డుకర్రతో,—ఆమె స్వహస్తాలతో అందించిన కర్రతో—దెబ్బలు తగులుతూనే ఉంటాయి అయినా అతగాణ్ణామె విడిచిపెట్టదు కోర్టెక్కదు మెల్లిగా ఆ భగవతుడే వాళ్ళకి రాజీచేస్తూ ఉంటాడు

ఆవేళ ఆమె ఆలస్యంగానూ వచ్చింది చుట్ట తేకుం డానూ వచ్చింది అతగాడికి కోపం వచ్చింది అడ్డమైన మాటలూ, అతడాడుతూ వచ్చేడు

ఆమె కేకపు వచ్చింది "నేనేం కూకున్నానా? ఆడు తున్నానా ఇంతేలయిందంటే నాకోసమా! నీ పాడలవాటు కోసమే ఓర్నడిగినా పుట్టదాయె పాడుచుట్ట" అన్నదామె

"సాలుసాల్లే మాసంపాయించేవు పొద్దు కెల్లిప్పుడొచ్చా వాయె ఇదంతా నాకోసమే నేటి ఏసాటం సరదాలో ఎగిరి తుండావో" అన్నాడతడు

"పో! పాడుమొగమా! నాకేటి సరదాలు తిండికి లేకఘోరిత్తుంటే సరదాలే తక్కువ నీ పాడుసుట్టకోసమని పాట్లెన్ని బడ్డానో ఆ బగవంతుడకి దెలియాలి కూకోనేక గుడ్డిమాలోకం దెబ్బలాటోటి" అంది ఆమె

ఎన్ననండిగాని ఉన్నమాటంటే ఎవరికేనా ఉడుకు బోతుదనమేనూ, అతడికీ అదేను

"ఏటన్నావు గడ్డోణ్ణా పోసిలే నన్నంటే నీకు రాదేటి ఆ అనుభవం"

"సాల్లే పాడుముండోడా శాపాలెడుతుండావు"

"పాడ్యేముండా, తిడుతుండావు ఏటి నువ్వే వుండా లేటి ఆ భగవంతుడు నేడేటి ఆడే పోత్తాడేదో నీరు' అని వేదాంత లోకి దిగేడతడు

"ఆ పోత్తాళ్ళె నీలాటి పాంప్పోళ్ళకి పోయ్యేద్దా అన్నాదామె

# ఇష్టంలేని ప్రయాణానికి అన్నీ అపశకునాలే

"అప్పుడు మాకేం పరువా? ప్రతిష్టా? చాల్లే అమ్మా అతిశయమా. ఊరుకో నీకో దండం" అంది మహా ఉగ్రోగ్రంతో-కంచుగంటలాంటి గొంతుకని తారాస్థాయిలో నిల్పి గంగా భాగీరధీ సమానురాలు వెంకమ్మగారు.

"ఆమాట నేనే అనుకోవాలా? ఉన్నమాటంటే ఉడుకోత్తుపడడమేం? కాక నీకేం బోయింది వేంగడ తలలెత్తుకో తిరగలేక చచ్చేవాళ్ళం" అంది అంతకంటె ఏమాత్రం తక్కువ కాని గొంతుకతో మహాలక్ష్మమ్మ.

'పోనీ అమ్మా మీరే పరువుగా బ్రతకండి మీ పరువు తీస్తూ ఈ యింట్లో నే నెందుకుండాలి ఇదుగో తక్షణం వెళ్ళిపోతున్నాను" అంది వెంకమ్మగారు బిరబిరా నట్టింట్లోకి నడుస్తూ.

"అయ్యో వెళ్ళవమ్మా ఎవళ్ళుండి ఎవళ్ళని ఉద్ధరించెయ్యాలి" అంది మహాలక్ష్మమ్మ.

కేకలు శృతిమించి రాగాన పడుతూ ఉంటే మరి తటస్థంగా ఉండలేకపోయాడు వెంకటాద్రివు అటు అక్కచెల్లెలు యిటు భార్య పరువు ప్రతిష్ఠలకోసం గొంతుక చించుకుంటూంటే తనకి కాదని నిద్రా ఊరుకుంటాడు ఎవరొచ్చినా తన పరువు ఎటూ పంచలవడం నిశ్చయమే అనుకొంటూ ఆ గతి సమాచారాలు పొంతం తనుకొండాకునే జిజ్ఞాసతో కచ్చేరీ చావడిలో భాలున లేచి హటూవాటిని రంగస్థలాంక చేసుకున్నాడు కాని ఇతన్ని గమనించేవాళ్ళెవళ్ళు

మూట ముల్లె బిగించి, ప్రయాణ సంరంభంలో ఉన్న వెంకమ్మగార్ని ఆపి అటు భర్యాని ఓ క్షణం నోరు కట్టవలసిందా శాంతించి ఏమిటీ సంగతని ప్రశ్నించేడు వెంకట్రావు

"ఆ! వచ్చారా! అప్పచెల్లెల్ని వెనకేసుకొనేందుకు? కానీండి నాకేం ఎధురొకత్తె తెలుస్తుంది తలెత్తుకో తిరిగే మొగాళ్ళట!" అంది మహాలక్ష్మమ్మ

"నన్నేం వెన వేసుకోవి నా తమ్ముడు నీ గొంతుకేం కోసీలేదే తల్లీ మరిడమ్మలాట నీ మెళ్ళో పుస్తెకట్టిన్నాడే మా తమ్ముడు మరోడయిపోయేడే మారీ చాల్లే ఇదిగో నే పోతున్నాను మహా పసుపుగా బ్రతుకుదువుగాని అంటూ మూట సర్దింది వెంకమ్మ

"అయ్యో! అసలు విషయం ఏమిటంటే చెప్పరేమరా! వెధవగోల" అన్నాడు మగాడు

"మీ అక్కయ్యనే అడగండి ఆమె నడత మీకే నచ్చాలి ప్రపంచంలో ప్రతివెధవా నవ్వేవాడే మన సంగతి చూచి అన్న జ్ఞానం కొంచెమైనా మనసున్నవాళ్ళకుండాలి" అంది భార్య

"అవున్నాయినా నాదే తప్పు లోకంలో ఎక్కడా లేనిదీ, ఎవరింట్లోనూ ఎరగనిది మహా నీచం అయిందీ నా వల్లే జరిగింది తప్పు మరెందుకు ఏ తప్పూ లేకుండా ఉండూ, అంటూ మూట పట్టుకో విరబరా వీధిగుమ్మందాకా వెళ్ళింది వెంకమ్మ

ప్రారబ్ధం యిష్టంలేక ప్రయాణానికి అన్నీ ఆటంకాలే అన్నీ అపశకునాలే ఒంటికంటి ఒంటి బ్రాహ్మడు అప్పయ్య

శాస్త్రి ఎదురుగా వచ్చేసరికి విధిలేక వెంకమ్మగారు ముందు కెత్తిన కాలు వెనక్కి పెట్టింది శాస్త్రి వీళ్ళింట్లోకే నేరుగా వచ్చేడు

"దీన్ని తగలెయ్యా! దిక్కుమాలిన శకునం" అంటూ వెనక్కి మరలిన వెంకటగారిని చూసి "అయిష్టమయితే అన్నీ అపశకునాలే" అంది మహాలక్ష్మమ్మ మళ్ళా యిద్దరూ అంట డ్డారు ఇంతసేపాయ చూస్తూన్న వెంకటూర్తిగాని, వచ్చి ఎల్చున్న శాస్త్రిగాని వీళ్ళ కలహానికి కారణం ఏమిటో పసి గట్టలేకపోయారు

కొంత నయాన్న, కొంత భయాన్న కొసరి కొసరి యిద్దర్నీ వేర్వేరే విడదీసి, ఓ ఘడియ విశ్రాంతిగా ఊరుకో బెట్టి ప్రశ్నిస్తే—

"ఏం లేదు నాయనా, నిన్న మనింట్లో బెల్లం కాఫీ తాగేమని పొరుగువాళ్ళ సుబ్బమ్మతో నే నన్నాను అదీ నే చేసిన మహాపరాధం అంతమాత్రాన్న పరువు పోయిందని నీ భార్యా ఆరాటం" అంది వెంకమ్మ తమ్ముడుతో

"బస్ ఇంతేనా మా యింట్లోనూ బెల్లంకాఫియే కొంచెం పంచదార ఉందేమోనని అడగడానికే నే వచ్చింది" అన్నాడు శాస్త్రి

కాక మామయ్యని సింబెక్టిమంటే పేరే అతడిదిగాని తక్కిన కార్యకలాపం అంతా మనచేతిమీదనే నడవాలి ఊరకనే మార్పుని ఏంజేశూర్యా అంటక ఈ ప్రయత్నం"

"మొదట్లోనే మీరెందుకు ప్రయత్నించేరు కాదు!' అన్నాడు వెంకట్రావు

"అప్పుడు ప్రారంభంలో మనకి ప్రయోజనం లేదు ఇప్పుడు వాడు ఏర్పాటు చేసిన మామూళ్లు దొంగఫీజులు వగైరాలన్నీ మన మీదకు తెప్పించవచ్చు కాని అప్పట్లో యీ సొసైటీ యింతమంది మెంబర్లు ఉన్న కాతాలు ఏమీ లేవు ఇప్పుడు మంచి లాభసాటిలో ఉంది కాబట్టి మనకి కావాలని యీ కాపత్రయం

"ఇది ఆనరరీ నౌకరీగదా మరి అతడి ప్రెసిడెంటిగిరీలో యీ సొసైటీ వృద్ధిపొందినప్పుడు అతణ్ణి ఎల్లా తప్పించెయ్యడం అన్నాడు వెంకట్రావు సంపూర్తిగా ఈ పైశాచికప్రబంధం అంతా వినాలని

' దానికేముందోయ్ వెండి చెప్పుతో కొడితే దేవుడికైనా తగిలితీరుతుంది తందిమ్ము తీసుతుంది తలచిన కార్యం అవుతుంది అందుకేగా నీతో ఏన్నోసార్లు అన్నాను చదివి లాభంలేదోయ్ అనుభవం కావాలోయ్ అని" అన్నాడు కరణం తన కార్యకుశలతమీద గర్విస్తూను

వెంకట్రావుకి మరి ప్రశ్నించాలనిపించలేదు వందో యాభైద్యో పారేస్తే లొంగిపోయే అధికార్లు మీద ఉన్నప్పుడు, స్వలాభమే పరమప్రయోజనంగా ఉన్న ఆనరరీలు కింద ఉన్నప్పుడు యీ సొసైటీలు గ్రామంలో ఉన్న రైతు

కెంతమాత్రం ఉపకరిస్తారో అతడికేం బోధపడలేదు అక్కడికీ తెగించి అన్నాడు ఎనతండ్రితో "ఏదో అన్యాయంగా ఆర్జిస్తామని ముందు వందో యాభైవో లంచాలు పోసి యీ ఉద్యోగం గడించకపోతే ఏం" అని వినీ వినపడకుండా

"వందా! అయిదువందలు పోతే ఏమిటోయ్ పట్టుదల మనం ఉండంగా మరోడు ప్రెసిడెంటుగా ఉండి సంపాదించేడంటే అది మనకి చిన్నతనంగాదోయ్ చూడు పాపంగానీ పుణ్యంగాని యీ పాటగడ్డమీద మన చేతిమీద జరగవలసిందే గాని యింకోడికి దుర్హో భాగం లేదనుకో" అన్నాడు గర్జిస్తూ కరణం రామన్నపంతులు

వెంకట్రావుకి అతనితో వాదించి లాభంలేకపోయింది ఆ మొదకుని మార్చడానికి తను చదివిన చదువు చాలదని నిశ్చయించుకొన్నాడు అయినా మామయ్యతోకూడా ప్రస్తావిద్దామని చూసేడు పోనీ! వీళ్ళు న్యాయంగా ఆ ఉద్యోగాన్ని నిర్వహిస్తారేమో అంటే అదీ లేదాయె అన్యాయంగానైనా ఆర్జిద్దామనే స్థిరసంకల్పంతోటే వీళ్ళు ప్రయత్నం చేస్తూఉంటే అతడికి చాలా అసహ్యం వేసింది

ఆ సాయంత్రం కరణం బావమరిది మూడు వందలు తెచ్చి కరణంచేతిలో పోసేరు ఖర్చులకని తన పర, భేదం లేని కరణంగ రెండులో ఓ వంద స్వాహాచేసి మిగిలింది అధికార్ల ఎదాన్న కొట్టెయ్యడానికి పట్నం తర్లి వెళ్ళారు ఓ వంద సంతకాలతో ఉన్న ఆయుధం ఓటి స్వహస్తాల్తో అధికార్లకి అర్పించేరు మీసం మెలిపెట్టి తిరిగి తన చావిట్లో కాలు మోపేరు

# ఈడొచ్చిన పిల్ల

## ౧

అయిదు వందలిస్తానన్నా చాలకపోతే మరెలాగ? చచ్చేదా? ఏ తన్ను తెచ్చేది? ఈ ఒక్కపిల్లే గనకనా? పోనీ? పిల్లకేమన్నా వంక ఉందా అంటే వేలెత్తడానికి లేశమా? చదువుకుంది? అంతో యింతో పాడుతుంది! పోతపోసిన బంగారపు బొమ్మలా ఉన్న పిల్లని కట్టుకోవయ్యా అంటే, పోయి కాలమా? 'యీ చదువు చాలదు' ఒకడు, అయిదు వేలిస్తే మాట్లాడు డీ' అని యింకోడు 'అట్టే ఫేషన్‌గా ఉండదండి యీపిల్ల' అని మరొకడు 'చా! చలాకీలేని పల్లెటూరు పిల్లలా ఉందే' అని మరో [illegible] అంటూ ఉంటే, యిక ఆడపిల్లని కన్నవాళ్ళంతా ఉరెట్టుకో చావవలిసిందే? అని పులిస్టాపులేని ఆలోచనతో బుర్ర చించుకుంటూ వాలుకుర్చీలో చేరబడ్డాడు వెంకన్న పంతులు

పిల్ల శ్యామల కట్టుదప్పి నాలుగేళ్ళయింది సంబంధాలకి తిరిగి తిరిగి సగం అయిపోయాడా పెద్దమనిషి వెధవ శారదాబిల్లు ఇంత వయస్సు లోపువాళ్ళు పెళ్ళాడకూడదనే చెప్పిందిగాని యీ వయస్సు దాటాక పెళ్ళికాకుండా ఉండరాదనికూడా శాసించేసే యీమగ వెధవలీ కట్నాలడగరేమో? అని ఆయన యీమధ్య వాదిస్తున్నాడు

పెళ్ళి అవదేమో! పోకిరీపిల్ల అని అంటారేమో? అనే దిగులుతో ఫోర్తుఫారం చదువుతూన్న పిల్లని నిరుడే చదువు

మాసిపించేసేడు చదువుకొంటూన్న రోజుల్లో కావాలన్న పెళ్ళి కొడుకులంతా యిప్పుడు 'ససేమిరా ఆ పిల్ల మాకక్కర్లేదనే అంటున్నారు

జారు పైటతో ఓరగా చూస్తున్న ఎల్ల ప్రతీ పెళ్ళి కొడుక్కీ యిష్టమే కాని, ఆ ఎల్ల తననేగాని మరెవళ్ళనీ చూడకూడదనిగూడ లోపల ఏడుపే గద !

విసిగిపోయిఉన్న భర్తకి సలహా యిచ్చింది కామమ్మ గారు 'పోనీండి ! దాని అదృష్టం ఎల్లాఉంటే అల్లానే వెడుతుంది ఈ సంవత్సరం మళ్ళా స్కూల్లో ప్రవేశపెట్టెయ్యండి చదువుకొంటే నౌకరీ చేసుకోనైనా బ్రతుకుతుంది' అన్నది

ఆ రాత్రంతా ఆలుమొగలిద్దరూ ఆలోచించి లాభనష్టాలు బేరజువేసి, ఎట్టకేలకి తెగించి పెళ్ళికొడుకుల్ని ఆకర్షించే వన్నెచిన్నెల కాగితం ఫ్యూచరుకి ద కాలేజీని జమకట్టి యీావల్లో చేవబడి తీసుతుందని నశ్చయించి మర్నాడు శ్యామలని తిరిగి చదువులో బెట్టారు

ఏడాది తిరిగేలోపుగా ఎల్లకి పెళ్ళి అవుతుందనే ధీమాతో ఉన్నకున్నారు

౨

శ్యామల స్కూలుఫైనలు ప్యాసయింది రెండేళ్ళాయ చదువుతూన్నా వెంకన్నపంతులుగా రాశించిన పెళ్ళికొడుకు మాత్రం సునాయాసంగా లభించలేక బోలేదుసుంది స్టూడెల్లు

పిల్లతో స్నేహం చెయ్యమంటే చేస్తారుగాని, కట్నం లేనిదే పెళ్ళి ఊసుమాత్రం ఎత్తరు

ఈ వెధవల మగతనం యింతే గాబోలు' అని అనుకోవటంకూడా కద్దు అంతు చూడాలనే ఆశ పట్టుదల ప్రేరేపించి యింటరు క్లాసులోకూడా శ్యామలని ప్రవేశపెట్టారు

ఓ యింటి కోడలై, ఉభయ కులదీపిక మవుదామనుకున్న శ్యామల ఇప్పుడిప్పుడు పెళ్ళిమానేసి మగప్రపంచం మీద కసి దీర్చుకుందామని చూస్తూన్నట్టుంది

మొదట్లో ఏ పెళ్ళికొడుకైనా తన్ను పెళ్ళాడతాడా అని చూసినపిల్ల యిప్పుడు పెళ్ళికొడుకుల్ని ఊరించి ఏడిపిద్దామనే తత్వంలోకె దిగింది క్లాసులోఉన్నా నలభైమందిస్టూడెంట్లు తన్నుచూసి గుటకలు మ్రింగవలసిందే వాళ్ళ నావిధగా గజదూరంలో నిలవేసి, పలచబెట్టి, ఏడ్పించవలసిందే

లెక్చరర్లందరికీ, ఆమె నోటంట చూస్తేగాని తెల్లారదు ఆమె క్లాసుకు హాజరు కానినాడు మిగిలినవాళ్ళకి పాఠమే బోధపడదు ఆటల్లో ఆమె, పాటల్లో ఆమె క్లబ్బుల్లో ఆమె, కంగాళీకి ఆమె! ఆమె లేనిదీ కాలేజీ లేదా? అన్నట్టుగా వ్యవహారిస్తోంది శ్యామల

తోటి విద్యార్థినులందరికీ తను నాయకురాలు ఆడపిల్ల క్లబ్బుకి ఆమె కార్యదర్శిని రోజూ సాయంత్రం నలుగురాడపిల్లలూ కలసి ఏ విద్యార్థినో లేక ఏ పేటచెయ్యా, అభాజనపు లెక్చరరునో కమ్ములుగట్టి, ఊసులేసుకోవడం పరిపాటి

క్లాసులోకి వచ్చిన ప్రతీ కుర్రవాడికి ఉన్న ప్రత్యేక లోపమేమిటో వాళ్ళకి - చదువుకంటే ఎక్కువగా తెలుసు

తాను నోటువేసుకొని అవసరం వచ్చినప్పుడు అర్పించటానికి తగ్గ అదుపులో ఉంచుకోవడంలో యీ ఆడ మళయాళం అందెవేసిన చెయ్యి

ఒకప్పుడు ఏ శ్రీశుకుడో బయల్దేరి ఎవళ్ళవేపు చూడకుండా తన మానాన తను చదువుకుంటూ పోతున్నాడూ అంటె ఆ విషయం ఎవ్వరికి అందరికన్నా శ్యామలకు అసలే గిట్టదు అలాంటి అప్రాచ్యుడు నారీసౌందర్యాన్ని అవమానిస్తున్నాడని అతగాడి అంతంలేని గోరోజనం అని అభిప్రాయం ఆ వ్యక్తిని ఏ విధంగానైన ఆకర్షించి తనవైపు మొఖం తిప్పేలా చెయ్యాలని ఆమె దృఢసంకల్పం ఆ అమాయకుడి పవిత్రహృదయంలో ఆరని అగ్నిహోత్రాన్ని అంటించేసేదాక ఆమెకి నిద్రపట్టదు అంతచేసి అవసర సమయంలో, మోసగించి 'మొగవెధవ!' అని తిట్టి యీసడించటం ఆమెకానందం

౩

ఆ కన్నెలాయన తన వెనక కుర్చీని తిప్పినట్టు తిప్పగా నగుతున్న రామారావుమీద ఏమో అకారణంగా శ్యామలకు తనంతతనకే ఎరగని భావం ఒకటి ఆ సాయంత్రమే కలిగింది ఆ రాత్రి ఆమెకి నిద్రపట్టలేదు

గత ఆరు నెలల చరిత్రా తిరగేస్తే ఎన్నోసార్లు అతణ్ణీసడించడం, అసహ్యించుకోటం, వేళాకోళం చెయ్యటం ఏడిపించడంకూడా జరిగాయి కాని యీవాళ అతడికోసమని, ఎన్నడూ లేనిది, తను నిద్రమానుకొని కంట తడిబెట్టడం అనేది

ఆమెకు వింతగా కనిపించింది తనలో ఏదో లోపం వచ్చిందను కుంది ఏదో జబ్బు ప్రవేశించింది అని భావించింది తను పెడ దారిని పడబోతుందేమోనని శంకించింది అతణ్ణి స్మరించ కుండా ఉండలేదా ? అని ప్రశ్నించుకొంది ఉండలేను అని నిశ్చయించుకొంది

రామారావు క్లాసులో అందరికంటే తెలివైన విద్యార్థి టీచర్లందరికీ అతడంటే ప్రాణం కళాప్రదర్శనాల్లో అతడికే ఎప్పుడూ మొదటి బహుమానాలు ఎప్పుడు చూసినా ఆ ముఖంలో చిద్విలాసం తాండవిస్తూనే ఉంటుంది అతడికొకరి ప్రమేయం లేదు ఒకరి ఊసు అక్కర్లేదు అతడికి కావలసినదల్లా చదువు బొమ్మలు అతడీ ఆరు నెల్లాయి ఓ చిత్రం గీస్తున్నాడు దాని మూలం శ్యామల

అతడు ప్రకటంగా వచ్చి శ్యామల ఫొటో ఉంటే ఇమ్మన్నా అడిగేడు లభించకపోతే స్నేహం చేసి పట్టుదల వదల కుండా అర్థించేడు ఆమెలో ఏ విధమైన దివ్యకళని, అతడు చూసేడో కాని యీ ఆరునెలలు ఆమె ఫొటో కోసం అంటే తను వాంఛించిన అందభాగ్యంతో, నిద్రాహారాలు మాని ప్రయత్నించేడు వెన్నాడి వెన్నాడి, వేటాడి, ఎలాగయితేనేం నిన్నటి సాయంత్రం పార్కులో శ్యామల మనస్సు కరిగి, అతడు కోరిన పోజులో అయిదు నిముషాలు నిలబడేసరికి అతడు స్వర్గాన్నందుకున్నంత ఆనందంతో కృతకృత్యుడై యిల్లు చేరాడు

దిస్సబోయి శ్యామల యిల్లు చేరుకుంది తన జీవితంలో ఒక మగవాడికి తను లొంగిపోయిన క్షణం, అదేనని అదే తన

కధోగతి కల్పించిందని ఆ రాత్రల్లా శ్యామల దుఃఖించింది కాని మళ్ళా ఆమెలో ఏదో క్రొత్తభావనలు కలుగుతూ ఉన్నాయి రామారావు ఎంత అమాయికుడు ఎంత పట్టుదల నీ మాదిరి చక్కనివాడే నన్ను లొంగదీసిన వ్యక్తి యిన్నాళ్ళకి కనబడ్డాడే యీ విధంగా ఆలోచిస్తే ఆమెకి మరో ఆలోచనకూడా తట్టింది తనకు తగిన వరుడుకూడా యితడే ఏమో? అయితే, యింత బ్రతుకూ బ్రతికి ఇంటి వెనకాల చావడమని, యిన్నాళ్ళు మాని యిప్పుడు పెళ్ళి పీటలమీద కూర్చోవడమా? ఛీ! మొగవెధవ!

౪

రామారావు చిత్రం పోటీలో మొదటి బహుమతి అందింది

చిత్రం చూసిన వెంకన్న పంతులు నివ్వెరబోయి ముక్కుమీద వేలేసుకొని, తలవంచి యింటిముఖం పట్టాడు. కూతురు శీలాన్నే అనుమానించాడు పంతులు, చదవ్వేస్తే ఉన్న మతికూడా పోయిందే! అనుకొన్నాడు భార్యని వది తిట్టి తననో వది తిట్టుకొన్నాడు

నేరుగా శ్యామల గదిలోకి వెళ్ళాడు "అయితే అమ్మాయి! యిదేమన్నా బాగుందా! ఈ కులం తక్కువ వెధవతోటా చుట్టరికం?" అన్నాడు

శ్యామల తెల్లబోయింది ఎంత చెప్పినా నమ్మలేదు వెంకన్న వంతులు చదువులో పెట్టి, యీడొచ్చిన పిల్లలతో తిరగడానికి స్వాతంత్ర్యం యిచ్చిన తండ్రి వరించిన పెళ్ళికొడుకుని చేసుకోవడం అంగీకరించకపోవడం ఏమా ? అని నిర్ఘాంతపోయింది

తనకు మరి పెళ్ళికాదు కాదేమిటి వద్దు దీనికి శాసనంలేకు

ప్రాణంఉండగానే ఆ యిల్లూ భూములు ఆ తోటలు అన్నీ తన చేత్తోటే దానం చేస్తున్నారంటే మరి వింతగాదూ?!

మంచి రెండుజాముల వేళప్పుడు ఆకలితో మొగం తిరుగుతూవచ్చి వచ్చి మంచినీళ్ళయినా యిమ్మంటే ఆ చేత్తో యివ్వలేకపోయిన వ్యక్తి ఉన్నట్టుండి యీవాళ వెన్నముద్దలా కరిగిపోతూఉంటే మరి ముక్కుమీద వేలేసుకోవలసిందేనా లేదా।

ఇంతకీ యీ తెగింపుకి కారణం ఉండదా? అని మాలో కొందరం వాదించుకున్నాము 'కల్లో దేవుడు కనిపించి చెప్పేట్ట!" అన్నారొకరు మొన్నెవళ్ళో జ్యోతిష్కుడు వచ్చి యిక పదిదినాలే నీకు ఆయుర్దాయం శాంతిచేసి ధర్మంచేస్తే యింకా ముప్పైయేళ్ళు బ్రతికే యోగ్యత ఎలల్న కంటూవ చెప్పేట్ట!" అని ఒకరు ఏలూర్లో వున్న వేలువిడిచిన మేనత్త చచ్చిపోయిందట దాని ఆస్తి కలసొచ్చిందట" అని యింకోరు "మొన్నటి జమీందారుగారిమీద దావాలో గెలిచాట్ట అదే యిది" అని మరొకరు ప్రారంభించేరు

ఇంతట్లో చావనా బ్రతకనా అని ఉన్నఆవుని మెడలో గావంచా కట్టి యీడ్చుకొస్తున్నాడు సూరావధాని దానం పట్టి

"ఏం? అవధాన్లూ! శేషయ్య యిచ్చిందేనా?" అన్నాం

'అ అదే దీనితోపాటు ముప్పైరూపాయలు దక్షిణ కూడా పెట్టాడు" అన్నాడు అవధాని

"బాగుందోయ్ పోనీగాని ఎందుకో యీ ధర్మం ఇలా చేస్తున్నాడు, నీకేమన్నా తెలుసా? అని ప్రశ్నించేడు మా తమ్ముడు

"అయ్యో! యింకా తెలియదేటి మీకు!" అంటూ అలా ఉన్నవాడున్నట్టె నిలఒడిపోయాడు అవధాని మా వెవ్వన్నీ ఆవుచెవుల్లా నిక్కపొడుచుకోవున్నాయి అతనేమి చెప్పేది వినేద్దామని

"శేషయ్యా ఎన్నత్తగారి తమ్ముడు పెద్ద ఆస్తిపరుడు మొన్న చస్తూచనూ తన యేవదాస్తిని దాన ధర్మాలక్రింద వినియోగించవలసిందని పిలువాేసి శేషయ్యాని ధర్మకర్తగా లిఖించేట్ట! అతడి దినవారాలకి పోను శేషించినదంతా శేషయ్యా దానం చేసేస్తున్నాడు అన్నాడు అవధాని

'ఏమాత్రేమేమిటి ఆ ఆస్తి" అని అడిగేను

"సక్షేత్రంగా అయిదువేలు సాలీనా రాబడి వచ్చే స్తిరం పదివేలు చరం ఉన్నాయట ఆ ముసిలాడికి యిరస్తాపరస్తా మరెవళ్లూ లేరట" అన్నాడు అవధాని

"అది కారణం లేకపోతే శేషయ్య దానం చెయ్యడం ఒకటా!" అన్నాడు మావాడు

"ఇందులో తనెంత మిగుల్చుకున్నాడో!" అన్నాడు మా వెంకట్రావు అవధాని ఆవు నీడ్చుకో వెళ్ళిపోతున్నాడు

"అవధానీ, అవధానీ నిలబడు, నిలబడు" అంటూ కేకలేసుకుంటూ రోజుకుటూ వస్తున్నాడు రామయ్యా అందరి కళ్ళూ ఆ వైక్కి తిరిగేయి అవధాని వెనక్కి తిరిగి నిలబడ్డాడు

"సరి ఆవుని పట్టుకుపోతున్నావా! చాల్లేవయ్యా అప్పుడే మరిచిపోయా? వొదులొదులు! అంటూ వచ్చి రావటం తడవుగా అవధాని చేతిలో వున్న గావంచా గుంజా యించి ఆవుని వెనక్కి మళ్ళించాడు రామయ్యా

"ఇదేమిటోయ్ ఇచ్చింది మళ్ళించేస్తున్నావు" అన్నాడు

"ఎవళ్ళండీ యిచ్చేడు ! ఆస్తి వున్నదా ఆ చచ్చినవెధవ రాస్తే అవను గాబోను గానియిచ్చాట్ట దాని తనమించినంత అప్పుకూడా వుందట ఆ ఆస్తిమీద చరం అనలే లేదట తన చేతిలో వో మూడు వందలు ఖర్చు ఆయిపోయాయి దినవారాల కని ఏడుస్తున్నాడు శేషయ్య" అన్నాడు రామయ్య ఆవు విడుస్తూను

"ఆదిరా ! శేషయ్య తమాషా !" అన్నాడు మావాడు

ఎక్కడివాళ్ళం అక్కడే తెల్లబోయి ఉండిపోయాం

# ఆనరీ మెంబరు

అయ్యాడు వెంకన్నపంతులు గ్రామ కమిటీకి మెంబ
రయ్యాడు ఓ కావలసిం దేమిటింక? పెళ్ళి మూడువందలు
ఖర్చయితే అవుగాక అడవి సంపాదిస్తుంది దిక్కుమాలినడబ్బు
ఈ గౌరవం ఈ ప్రతిష్ఠా ఈ పెద్దరికం, ఈ పలుకుబడీ చస్తే
వస్తుందా పరలోకానికి

అంతకుముం దతగాడు చాలా మంచివాడు ఈమధ్యనే
అతడు కొంచెం మారిపోయాడు ఖద్దరుకట్టి గాంధీ టోపీ
పెట్టగానే అతనిలో ఓ విచిత్రమయిన మార్పువచ్చింది కాం
గ్రెసు రాజ్యంలో తనవాటా కలిగిద్దామనే అభిలాష నేటికి
కార్యరూపం దాల్చింది

అసలు వెంకన్నపంతులు దూరాలోచనగల వ్యక్తి,
ఈలాటి అవకాశాలు చాలా ఉంటాయనే ఈ మధ్య అతడు
కాంగ్రెసులో చేరాడు భగవంతు డనుకూలించి అతణ్ణి
మెంబరు చేశాడు

ఆవేళ ఆంజనేయస్వామికి కొబ్బరికాయలు, వెంకట్రమణ
మూర్తికి దీపారాధన శివలింగానికి అభిషేకం రామపరానికి
నైవేద్యం, యిన్ని లభించాయి అతనికి మెంబరీ లభించడం
దేవుళ్ళకీ సరదాగానే ఉంది స్నేహితులకీ యింత టిపార్టీ
యిచ్చాడు వెంకన్నపంతులు

అయిపడారు మొక్కుబళ్ళతో కలసి, వెరసి అతనికీ
మెంబరీ విషయంలో అయిన ఖర్చులు మూడువందల యాభై
రూపాయిలు ఈ మధ్య వీధిలో కెళ్ళేటప్పుడు వేసుకునేందుకు
గాను, అనవసరంగా కుట్టించిన ఖద్దరుబట్టలకి యాభైరూపా

యాల ఈ నాలుగు వందలు ఏవిధాన్నైనా ఈఉద్యోగంలో లాగెయ్యాలనే కోర్కె లాగెయ్యగలననే ధీమా రెండూ ఉన్నాయి అతనికి

వెంకన్నపంతులు యిప్పుడు వచ్చిపోయే వాళ్ళతో నిండిపోయింది ఏ వేళప్పుడు చూసినా అగమం పాలెమందైనా ఆ గుమ్మంలో పడిగాపులు పడుతూనే – టాకు పంచదార అతడివ్వాలి పప్పులతడనుగ్రహించాలి కగ్గ లతడు పంచి పెట్టాలి మగ్గాలతడు చీటి యివ్వాలి ఎన్నిపనులు! ఎంత అధికారం!! ఊరక దుకే తిండి పెట్టా సప్లై చేయడు అంటే ఏం తక్కువ పనా!

సంతకానికి పావలా చొప్పున మామూలు పెట్టాడు వెంకన్నపంతులు ఇల్లు నిండిపోయింది – పావలాలతో షాపుకి పెట్టిన మనుపు ఖద్దరు గుడ్డలకి పెట్టినఖర్చుకాక, రెణ్ణెల్లలోనే మరో అయిదువందలు లభించాయంటే ఆ ఉద్యోగం తక్కువదా!! చల్లగా ఉండాలి కాంగ్రెసురాజ్యం గౌరవానికి గౌరవం! పలుకుబడికి పలుకుబడి! డబ్బా లెక్కలేదు! చల్లని మహారాజు గాంధీ! ఏ తెచక్కని సూత్రంకని పెట్టాడు! ఇంతకీ కోమటి! అని అనుకొనేవాడు రాత్రిళ్ళు పడుకనే టప్పుడు వెంకన్న పంతులు

ఇంతకుముందు మొఖం ఎరగని వ్యక్తులంతా యితని కిప్పుడు స్నేహితులే ఇతని దగ్గరికివచ్చిన ప్రతీమనిషీఅదేమిటో డబ్బంటే ఎక్కువమేఉండదు మాట్లాడుతూ మాట్లాడుతూనే అయిదులు పదులు ఎడంచేత్తో అందించేస్తారు పత్రికల కితడంటే యిప్పుడమితానురాగం వాళ్ళూ యితడూ కలిసి

నోరులేని వాళ్ళెవళ్ళనో నిఘాపట్టి వాళ్ళ బట్టల చీటిలో గుడ్డ అతిసునాయాసంగా అస్మదీయం చేసుకొనే ఉపాయం కని పెట్టాడు పంచదార మిగిల్చి ఏవిధంగా ఎక్కువకి అమ్మాలో నేర్చుకున్నాడు పప్పులు కైమాపుచేసే పద్ధతులు సూత్రించేరు మస్తానికి పాతిక రూపాయిలు మా[illegible]లు పెట్టేశారు ఆతని బుద్ధి చాలా మరుకయింది! సూక్ష్మమయింది కూడాను!!

వెధవది! తహసీల్దారొక్కడే మంచివాడుగాడు అసలరీ ఉద్యోగి అన్న గౌరవమేనా ఉంచకుండా ఉత్తరాలు వ్రాస్తూఉంటాడు వెంకన్నకి దిక్కుమాలిన కాంగ్రెసు వాళ్ళే తహసీలు దార్నెందుకింకా ఉంచారో అనిపించేది అతని కప్పు డప్పుడు తనిష్టం వచ్చినట్టు చెయ్యడానికి, ఈ తహసీల్దా రాటంకం ఏమిటీ అని అతనికి విసుగు పోనీ తృణమో పణమో తినవయ్యా అంటే తినలేని దిక్కుమాలిన పీనుగు ఉద్యోగి అవడం ఏమిటి నా బొంద అని అతని వాదన

ఊళ్ళో ఎవళ్ళెవళ్లో తనమీద ఎటీపనులు వ్రాస్తూన్నా రన్నసంగతి విని మండిపడిపోయాడు వెంకన్నపంతులు, ఖుందా వెధవలకి ఎవ్విధమయిన పెర్మిట్లు యివ్వకూడదని నిశ్చ యించాడు ఎదురుపచ్చ ఓర్వలేని లోకం అని కంటగించు కొన్నాడు యథాసాధ్యం దీపం ఉండగానే యిల్లుచక్కబెట్టుకో వాలని జాగ్రత్తపడే ఈ మధ్య గడించిన మూడువేలల్లోనూ ఒకటి నాదికాదని పైవాళ్ళకి పంచి మళ్ళా తాపీబడ్డాడు మళ్ళా ఏ గాలివానో వచ్చేదాకా ఫరవాలేదు

— —

# అగస్త్యభ్రాత రచయిత అప్పితో ఇంటర్వ్యూ

అసలీ ఇంటర్వ్యూలన్నీ యథార్థంగా జరిగినవేనా అన్న సందేహం నాకు చాలాసార్లు కలిగింది. అయితేనేం రోజూ ఏదో ఓ పత్రికలో ఎవరో ఒకాయన ఓ ఇంటర్వ్యూ గురించి తెగబరుకుతున్నాడంటే మరెలాగ నమ్మకపోవడం. ఇంతకీ ఇంటర్వ్యూలతో పత్రికలునింపే కళకూడా ఇప్పటిరోజుల్లో అగ్రస్థానం వహిస్తూన్నప్పుడు నాలాంటి అగస్త్యభ్రాత రచయితకి నిద్రపట్టడం ఎలాగ? ఎవరినో ఒకర్ని ఇంటర్వ్యూ యిమ్మని బ్రతిమాలో బహుమాలో అథవా రికమెండేషన్ చేయించుకొని సంపాదించో, ఆఖరికి సత్యాగ్రహం చేసైనా గెల్చుకోకపోతే మరి వ్రాయడానికి విషయాలేమున్నాయి ఊటునాకు తాయా ఏమిటి?

'గతానుగతికోలోక' అన్నారు అంతా యింటర్వ్యూలు సంపాదించి పేరు తెచ్చుకొంటున్నారుగదా నాకేనా లేకపోవాలి అనే ఈర్ష్య పట్టుదల తాపత్రయం, ఆంధ్రుణ్ణయిన నాకు సహజం అయిపోయాయి అందుకోసం ప్రయత్నించటం మొదలెట్టి ఆరు నెలలయినా, ఒక యింటర్వ్యూ అయినా ఏ ఒక్క ఘరానావ్యక్తి దగ్గరా సంపాదించలేకపోయినంత దురదృష్టంకూడా నన్నంతగా దుఃఖపెట్టలేదు పాతిక సంవత్సరాలాయి ప్రయత్నిస్తూ మా రాష్ట్రం మా జన్మహక్కయ్యా మాది స్వయంపోషకమయ్యా అని గోలపెట్టి, గగ్గోలు ఎత్తితే సిద్ధించింది ఆంధ్రరాష్ట్రం వారిలో నేనొకణ్ణి గదా! యీపాటి యింటర్వ్యూ దొరకలేదని ప్రయత్నం

భంగం అయిందనీ ప్రయాస మిగిలిందనీ వ్యయం తగిలిందనీ, బేరీజువేసి కూచు టానా? అస భవ !

ఏతావతా నాకు యింటర్వ్యూ మహాభాగ్యం దొరక్క పోవటానికి హేతువేమిటా అనికూడా యీమధ్య కుర్చీలో కునుకుతూ ఉంటే బోధివృక్షం క్రింద బుద్ధుడికమల్లే, జిజ్ఞాస సమాధానంకూడా ఉద్భవించేయి నాకు ప్రాంత డాబుసరి ఉండాలనిన్నీ ఉన్నది లేనిది కల్పి ఏకవిత్వం చెప్ప గల్గే శక్తిసామర్థ్యాలుండాలనిన్నీ యింటర్వ్యూ యిచ్చి తద్వారా పేరు తెచ్చుకుందామనే ఉబలాటం ఆ వ్యక్తి కోర కూడదనిన్నీ ఈ వ్యక్తి యింటర్వ్యూ యిస్తే మనం ధన్యులమై, మన పత్రిక సఫలమై మన వంశం దశపూర్వేషాం దశాపరే షాం తరిస్తుందని తలచేవిధంగా రచయిత వ్యక్తిత్వం ప్రస్ఫుటిత మవాలనిన్నీ, యింకా యిన్ని మరిన్ని ఎకులు ఉపాయాలు ఊహాలు, ఊటబావారినట్టు ఊరి ఉక్కిరిబిక్కిరి చేసి విడిచి పెట్టాయి ఏవం విధగుణగణ్యత ఏది నాలో లేకపోవడం నా దరిద్రం అస్తు

మొట్టమొదట నేను యింటర్వ్యూకి ప్రయత్నించిన వ్యక్తి తారాపథంలో కులుకుతున్న ఓ జ్యోత్స్నాదేవి తారలతో తరచుగా యింటర్వ్యూలు చేస్తున్నవారిలో ఉన్న చాకచక్యం ఏమిటో, అసలా టెక్నిక్ ఏమిటో నేను చదువుకోలేదు ప్రారబ్ధం నా యింటర్వ్యూ బెడిసికొట్టి, యితలున్నవాళ్లే ఇవతలుంచుతూనే యింటికి ఖుషపట్టేను అయితేనేం అందరూ తారలతో యింటర్వ్యూలు చేస్తే నేను పురుషుణ్ణాయి, ధీరు ణ్ణాయి, అందులో ఆంధ్రుణ్ణాయి, ఆడారివెధవ యింటర్వ్యూ

చేస్తానా? అని ఓ తారడికోసం ఆ పూర్నాడే బయల్దేరి వా
డింటిచుట్టూ మూడుసార్లు వాడి థియేటరుకి ఏడుసార్లు
వడొచ్చే త్రోవలో పదిసార్లు ప్రదక్షిణించి ఆ ఆసామీచేత
'అసమయం' అనిపించుకో - ఆమాత్రమైనా మా టాడగలిగే
ననే విజయగర్వంతో యింటికి వచ్చేసేను

అక్కడికది ప్రథమాధ్యాయం ఈతూ ఓ రాజకీయ
వేత్తతో ములాకత్తుచేద్దామనే ముచ్చట కలిగి బయల్దేరితే
అయినవాళ్ళంతా ఆఫీసుల్లో ఉండటం - కాని వాళ్ళంతా
కారాగారవాసంలో ఉండట వల్ల తగిన వ్యక్తి ఎవరా అనే ప్రశ్న
చాలా చికాకుపెట్టింది ఎట్టొచ్చీ మావూళ్ళో ఉన్న 'ఎమ్మెల్లే
గారు మాత్రం తీఋబడిగా ఉన్నారుగదా అని యింటర్వ్యూ
ప్రసాదించ గలందని ప్రార్థిస్తూ అర్జీ కోసహా హాజరయ్యేసరికి
దాని కర్మంగాలిన వేగావిశేషం అప్పుడే ఆయనతో ఆయన
బావమరిది సిమ్మెంటు బ్లాకుమార్కెట్టుదారు అర్జంటుగా
మాటాడాలని అశేషువారింటివిప్పినట్టు వచ్చి అంటూ తీసు
కొనిపోయి అదృశ్యంచేసేడాయె ఆయన లోపల ఏం మంత్రిం
చేడోగాని యీాయనికి మతి చలించి మరిప్పట్లో మాటాడ్డానికి
తీరిక లేదండీ అని బాంబ్రోతు ముఖాన నా కబురందించినందు
వల్ల అక్కడకా అధ్యాయం శుభమస్తు అనిపించుకొంది

పోనీ మా తాలూకాగారి ఊళ్ళో ఉన్న అవధానిగారు కవి,
పండితుడూ పదికాలాలు చూచినవాడూ తల నెరిసినవాడు
గదా ఆయనతో యింటర్వ్యూ చెయ్యకూడదా అని శంకా
సమాధానాలు వేసుకుంటూ ఓనాడు బయల్దేరేసరికి మధ్యే
మార్గంలో ఉన్న కలెక్టరుగారి బంగళా నా దృష్టిని ఆకర్షించి

అప్రయత్నంగా నన్నా ప్రక్కకీడ్చిగెళ్ళింది నే వెళ్ళేసరికి కలెక్టరుగారు ఊళ్ళోలేరన్న సంగతి తెలియగానే "పోనీ! ఆయన సతీమణి" అన్న ప్రశ్న అనుకోకుండా నోటివెంట వెడలి అతడింకా బ్రహ్మచారి అని తెలిసేసరికి నిలువెల్లా చెమర్చినట్టయి దిస్సబోయి వెక్కి మళ్ళపలసివచ్చింది

ఒక్క యింటర్వ్యూకోసం నేనిన్ని పాట్లు పడుతూవుంటే ఇటున్న సూర్యుడటు తిరిగేసరికి యింటర్వ్యూ సంపాదించి సంపాదకులని ఉక్కిరిబిక్కిరిచేస్తున్న నాపాటు రచయితలెంత పుణ్యాం పండించుకొన్నారో! ఏం నోములు నోచేరో!

ఆవేళ అరుగుమీద కూర్చొంటే అప్ప కనిపించింది అది చిన్నప్పుడు మావూరి గ్రామదేవత పండుగలో శివాలేసేచేసే భరతనాట్యం వర్ణనాతీతం — అసలు దాని గాత్రం అనుభవైకవేద్యం — ఊహవచ్చినప్పుడు ఊకుగోసం అది ప్రారంభించిన పాట — ఉడుకెత్తే రక్తం అంటూవుంటే ఉడికించి, ఊగించి "ఊ! కానీ!!" అనిపించి తీసుకుంది — ఆ వయస్సులోవున్న మావూరి నాయిరాళ్ళందరికీ అది నాయకి — కూలీలలో అది మేస్త్రీని — అదో పార్టీకి అధికారిణి — భేష! ఈమెకో యింటర్వ్యూ ఎందుకు చెయ్యకూడదూ! అనిపించింది „ ఆడుతుంది — పాడుతుంది — అభినయిస్తుంది — కాబట్టి యిది యీ కాలకేమి తీసిపోదు — పార్టీ నడిపిస్తుంది కాబట్టి రాచకీయాల్లోకూడా పాత్ర నిర్వహిస్తోందన్నమాటే కదూ! ఇంకా చెప్పాలంటే యీమధ్య మావూరి కరణం మునసబు అన్యోన్యకలహంలో ఇటు మునసబుకి చెల్లెలై అటు కరణాన్ని లోకువచేసుకొని ఈ యిద్దరికీ రాజీకుదిర్చిన నాయబారి గాబట్ట

యింతకిమించిన రాజకీయవేత్త - కాదు- రాచకీయాల్లో స్త్రీ
పాత్ర - మరి యీపాటి గడ్డమీద లేదన్నమాట ధృవం కాబట్టి-
ఈమెకో యింటర్వ్యూ చాలా ఎన్నికైనదే అనినాకు తట్టింది-

పాపం పిలవగానే దగ్గరసావచ్చింది అప్పి- "ఇంటర్వ్యూకి
రేపు మీాయింటికి వస్తాను నీకెప్పుడు తీరుబాటుగావుంటుందో
చెప్పగలవా?" అంటే నామాట అర్థంకాలేదు సరిగదా అపా
ర్థంకూడా అయినట్టయి 'శా! ఊరుకో బుగతా!' అంటూ
వెళ్లిపోబోయింది - అయ్యో ప్రారబ్ధమా! అప్పకోకూడా
యింటర్వ్యూ దొరకదా!! అని మళ్ళా బ్రతిమాలి పిలిచి
"అప్పీ నీకేమిటి అలవాట్లో చెప్పుతావే!" అన్నాను "ఏటి
బుగతా! ఏటి ఎచ్చొత్తిందేటయ్యా!" అంది నిజమే! అని
పించింది నాకన్నూ "లేదు చెబుదూ" అన్నాను "నాకేటల
వాటుంది! కొంచెం అడ్డపాగాక్క-టే సిన్నప్పటినుంచివున్న అల
వాటు" అంది "పోనీ నీకెందులో ఎక్కువ సరదా ఉత్సాహం
వుంటాదో చెబుదూ" అన్నాను "నందివృన్నానికి సంబరం
చేత్తే నానాదేముణ్ణెత్తాలంటే నాకు సాలా సరదాబాబూ! మరి
గంతే, కోలుబొమ్మలోళ్ళంటే నానువడి సచ్చిపోతాను"అంది

మా సంభాషణ మరిచిపోతానేమోనని వైనం వారిగా
వ్రాసుకొందామని మొదలుపెట్టేసరికి అప్పికి ఏదో అనుమానం
భయంకూడా కలిగినట్టున్నాయి 'ఏటీ బుగతియ్యేలేదో
తాగినట్టున్నాడు? ఓలె! ఓ వెంకమ్మా! బుగతరాల్ని పిలువే!
ఇతగాడోలకం ఏటో ఏంబాగునేక" అని కేకవేసేసరికి ఆ కేక
హనుమంత బొబ్బలా వినపడి మా అరాంగి అమాంతంగా

అంటూ, రెండు కోడెన్ని విప్పేశాడు-

"చూడు రామన్న బాబూ, ఇట్నో ఎల్లక పొద్దులు నిండాయి దండంత బలగంవున్న కొంపాయె మారాజులు మీరు సూడకపోతే మేం బతకడం ఎట్టా సెప్పు తండ్రీ! ఒక్క నెల్రోజులు పొద్దాగినట్టయినా పువ్వుల్లోబెట్టి మీ సొమ్ము మీ కిచ్చుకుంటాను" అన్నాడు సన్యాసినాయుడు ప్రాధేయంగా

ఇలాటి మాటలు పొద్దుపొడిచింది మొదలు మాటు మణిగేదాకా ఎన్నిగొంతుకల్లోంచో వింటూఉండటం రామన్న షావుకారుకి పరిపాటి అతని చెవులు ఏటి కలవాటుపడి పోయాయి ఇలాట ఏడుపులు విని విని విని అతని గుండె మరీ రాయిగా మారిపోయింది

"ఏమ్మాటలు సన్నాసులూ యివి చూడు సంసారం అంటూ ఉన్నాక కష్టం, సుఖం, కర్చూ కవామత్తూ లేని బ్రతుకుంటుందా కాక ఇన్నాళ్ళు నిన్నిబ్బందిపెట్టి అడిగేనా? ఇప్పుడు మాకూ కొంచెం రొక్కటంగా ఉండబట్టే ఇంతగా అడగవల్సవచ్చింది" అన్నాడు రామన్న ఆతడిలాటిసందర్భాల్లో మాట్లాడటం చక్కగా నేర్చుకున్న వ్యక్తి హృదయంలో లోటుపడిన కరుణ మాటల్లో కూడబెట్టుకోవటం అతడికి పిత్రార్జితమయిన శక్తి

"కాదుబాబూ, మీ రలా నిలేస్తే ఏటి సెప్పేది చూజాత్తు సంపెత్తారా? అమాంతంగా కొంప నట్టేట్లో దింపేయడం ధర్మమా మారాజా! తరతరాలాయె మీ

సొమ్ము దినొన్నాళ్ళుగాని యీనాటోళ్ళయా ! వొక్కటుంటె వొక్క నెలాగండి మీ రుణం దీసుత్తాను" అన్నాడు సన్యాసి మళ్ళాను

అసలు అతడు బాకీఉన్న మొత్తం ముప్పైరూపాయిలు వడ్డీలతోటి మామూళ్ళతోటీ తిరకాసులతోటి పాపం పెరిగినట్లు పెరిగిపోయి అది నూటయాభై కిందికి లెక్క తేలిందిప్పుడు అది తక్షణం యివ్వకపోతే మొన్న కొన్న కోడెల జత యేలం వేయిస్తానని షావుకారు బెదరింపు డిక్రీఅయి సిద్ధంగా ఉన్న బాకీ అది

"వల్లకాదు సన్యాసి మరి వెళ్ళు ఈ సాయంత్రానికి జతపెట్టేవా సంతోషమే లేకపోతే వారంరోజులలో జప్తు చేయించి మరీ నా బాకీ రాబట్టుకుంటాను" అని అంటూ యింట్లోకి వెళ్ళిపోయాడు రామన్న నిజానికి, అతనికిప్పుడు సొమ్ము అవసరంగాని, సన్యాసి యివ్వలేడనే బెంగగానీ కాదు కారణం ఈ పట్టుదలకి ఈ సంవత్సరం పండిన వేరుశనగ కాయలు బేరం సన్యాసినాయుడు మరొకళ్ళకిచ్చేడు అదీ కోపం కుంచ దగ్గర ఒక అణాకి కక్కుర్తిపడి ఈ సాలుపంట రెడ్డి షావుకారి కివ్వడం ఏం పోగాలమో ? తను అడిగిన ధరకి నష్టమయినా యిచ్చియవలసిందే సరుకు అలా కాకుండా నాడు మరి పేచీలే ! అందుకే ఈ డిక్రీ సిద్ధమయింది

గంపెడు నిరాశతోటి, పుట్టెడు గుండె దిగులుతోటీ, వంచిన తల ఎత్తకుండా నేరుగా వచ్చి సెట్టెట్లో నడుము లటుక్కుమని కూలబడ్డాడు సన్యాసినాయుడు కళ్ళు చీకట్లు

గమ్మినట్లయింది దిక్కుతోచని అవస్థతో చతికిలబడ్డవాడు అలాగే ఉండిపోయాడు గంటా గంటన్నర సేపు

శెనక్కాయ అమ్మిన సొమ్ము చిల్లరబాకీలకి మదుపులకి తెచ్చిన మొత్తానికి సరిపోయింది ఇంట్లో సుక్కానీ లేదు ఎల్ల పురుడెలా వెళుతుంది భగవంతుడా అని ఏడుస్తూన్న నాయుడికి ఈ అనుకోని ఆపద అశిరమ్మ మొక్కులా కనిపించింది

నిరుడీ రోజులల్లో నాన అవస్థలుపడి కొన్నాడు కోడె జత రామలక్ష్మణుల్లా రెండూ వాకిట్లో ఉంటే ఎంతో నిండుగా ఉండేది చిల్లంగి దిక్కుమాలిన కళ్ళు రామన్నవి వీటిమీదే పడాలా? ఈ సాయంత్రానికి బాకీ తీర్చకపోతే వారం రోజుల్లో జప్తుపటాక్రిక మానను రామన్న ఎరాచి ఏం దారి ఇప్పుడే ఏట్లోపడను ఎవళ్ళ కాళ్ళు పట్టుకుంటే యీ ఆపద తీరుతుంది ఇంతేనా ఈ నాటితో కోడెంకిమణికి ఋణం సరా ' అని పరిపరివిధాల ఆలోచనలు పరిగిడుతున్నాయి ఆ బుర్రలో అతనికి ఆరోజు తిండి సయించలేదు ఊరల్లా తిరిగేడు ఎవరిని అప్పు అడగడమూ అని ఎక్కడికెళ్ళినా యితని కంటే ముందే వెళుతూంది 'నాస్తి దేవత అతనికి వెర్రెత్తినట్లయింది లేనివాళ్ళు సరే లేదన్నారు బాగుంది ఉన్న వాళ్ళుగూడా లేదంటారేం చెప్మా అనిపించింది ఛీ పరపతిలేని బ్రతుకు ఏం బ్రతుకు అనిపించింది ఈ అవస్థలుపడ్డకన్న చావే ఓయింత మెరుగేమో అని తోచింది వెళ్ళినవాడు వెళ్ళినట్టే దివాలుగా యిల్లుచేరాడు

సాయంత్రం అయ్యేసరికి కబురు వచ్చింది షావుకారు దగ్గర్నుంచి కనపడకుండా పోదాం అనుకున్న సన్యాసి అనుకోకుండా కనిపించిపోయాడు బుర్రవంచుకొని కబురు తెచ్చిన మనిషితోటే వెళ్ళేడు రామన్న దర్శనానికి వే విధాల తన అవస్థ వర్ణించేడు కాళ్ళావేళ్ళాపడి ప్రార్థించేడు కన్నీళ్ళు కూడా కార్చేడు కాని రామన్న మనస్సు కరిగించటం అతని తలమించిన పనయిపోయింది

రామన్న షావుకారు మరీ ఉగ్రుడై వున్నాడు భల్లూకపు పట్టుగా బిగించి కూర్చున్నాడు దాంతో సన్యాసి కన్నీళ్ళు అజస్రవాహినుల్లా మారిపోతున్నాయి పాపం! సన్యాసికి కాళ్లూ చేతులు ఆడలేదు మాటిమాటికీ శెలకాయల బేరం సంగతి దెబ్బపొడుస్తూఉంటే మరీ బాధగా ఉంది మహోగ్రా బ్రతకడం కూడా యితడొప్పడేమో అనిపించింది ఇకన్ను ఉద్ధరించే దేవుడే లేడనిపించింది

షావుకారు గుమాస్తాలో పనిలేకపోయినా హాస్యమాడేవాళ్ళు అనేకులు అతని మాటలో మాట కలిపి వెనకపాట పాడడం వాళ్ళ ఉద్యోగం వీలయితే దగారిపని వాళ్ళ ధర్మం "వ్రేళ్లల్లో వున్నపాపు కాటుకచేరం యివ్వకపోడు ఏ ధర్మం" అనేవాడొకడూ "పోని ఆ కాయలమ్మిన సొమ్మేనా పట్టుకొచ్చి ఇచ్చేరాదు" అని ఇంకొకడూ "ఒకడికి బాకీ ఉన్నప్పుడు యింకోడితో వ్యాపారం ఏమిట"ని మరోడు తీస్తున్నారు దీర్ఘాలు నడివీధిక్కితే నాలుకలేనా కొడవ

అంటూ, రెండుకోడెల్ని విప్పేశాడు- 

“చూడు సన్నాసీ యిలా రా” అన్నాడు వెంకన్న అనుగుదిగుతూనూ ఏమో అని అనుకుంటూ వెళ్ళాడతనికో సన్యాసి అతని కళ్ళల్లో ఆశాజ్యోతి వెలిగింది

‘ఈషావుకారు మూర్ఖుం ముండాకొడుకోయ్ వినడు నీ కూతురుమెళ్లో ఎవరు ఎప్పీ ఏదైనా ఉంటే అందాకా యిచ్చి కొంచెం ఊరుకోబ్బు లేకపోతే కొంప ముంచేస్తాడు వారం రోజుల్లో నీ ఎడ్లు కూరి సీవికాం ఏదోచూడు ఇక్కడ ఎంత సేలా ఏడ్చినా యింతే” అని సలహా యిచ్చేడు వెంకన్న

వెంకన్న ఆ ఫ్రాంత కరణం డబ్బున్నవాడిమాట ఊరం తా ఆడతారు వెంకన్నకూడా మరి ఊళ్లోవాడే! కాక సమ యాసమయాల్లో యిలాటి కలహాలు చెప్ప ఆపదలో అడ్డుపడి నాలుగుడబ్బులు చేసుకోడం అతడికి వృత్తి ధర్మం సన్యాసి పట్టుకొచ్చే పనిమికి వెలకట్టి అటు షావుకారుకి ఉప కారం కలిగేలా తీర్పుతీర్చి ఇటు సన్యాసికీ సమయానికి అడ్డు పడి సంతోషపెట్టి ఉభయత్రా కొంచెం చేసుకోడం అతనికి నచ్చిన పని

“బావు దిగాని వెంకన్నగారూ! ఎళ్ళ మెళ్ళో తుక్కు తీసేత్తే అదొప్పుద్దా దాని వసువు గంగలో కలుత్తే తరువాత గతేట” అని గోణిగాడు సన్యాసి

“ఓయ్ వెర్రిమొఖమా అందాకా అవుసర నైవేద్య మోయ్ ఇది తరవాత ఎక్కడో ఎవడిబుర్రో గొట్టి అప్పు తెస్తే యీ పద్దు విడిపించెయ్యలేక పోతావోయ్ పట్టిద్దూ నామాట విని” అన్నాడు వెంకన్న

ఈ చీకట్లో ఆ ఉపాయమే కొంత వెలుగులా ఉంది అడుగులు రాకపోయినా మనస్సు పలువిధాల పోతున్నా సన్యాసి కేసు మొఖంపెట్టక మానలేకపోయాడు అనుమా నిస్తూ, ఊగుతూ, సగం చచ్చి కళ్ళింటనీళ్ళా గొంతులో పినర్వం వాలుకితూ కూతుర్ని యీ ఆపద కడుపడ మని బ్రతిమాలేడు భగవంతుడతని ప్రయత్నంలో తోడు పడ్డాడు! యత్నం ఫలించి రెండున్నర తులాల నానుకోళ్ళు వెంకన్న చేతులో తాకట్టుకి సిద్ధమయ్యాయి

అయింది తాకట్టుసొమ్ము యీ బైరూపాయిలు రామన్న చేతిలో పోసి రాజీవేసి మిగతా సొమ్ము నెలనాడు యిచ్చే యడానికి నిశ్చయం జేశాడు వెంకన్న కరణం బ్రతుకుజీవుడా అని యింటికి వచ్చాడు సన్యాసి రాదివ్వాలని రామన్నకుగాని అడగాలని సన్యాసికిగాని తోచకపోదు అడిగితే ఏ కోపము వచ్చునో! అసలు రాజీయే కుదరదేమో!!

తాకట్టు నగమీద మరో ఏభై సన్యాసికి తెలియకుం డానే వెంకన్న యింట్లోకి ఎగిరిపోయాయి నెలరోజులూ కళ్ళు మూసి కళ్ళుతెరిచే యింతలో యివే ఎగిరిపోయాయి భగవం తుడు ధర్మమాఅని యీమధ్య సన్యాసికూతురు సుఖంగా ప్రసవించి పనసపండులాటి కొడుకుని కనింది ఈ సందర్భంలో దైవమహాత్మ్యంవల్ల పదిరూపాయలు నాయుడికి అప్పుకూడా పుట్టింది ప్రిటీ కప్పులకి నెల్లాళ్ళు అయాయో లేదో అప్పుడే వీకమీద సవారీ అయ్యాడు రామన్న షాపుకారు మొదట యాభై మరచిపోయాడు కూడానూ యీమధ్య పెరిగిన వడ్డీ

తోసహా వసూలు చేసుకోనేందుకు బేటామీనితో సహా జప్తు వారంటు పట్టుకువచ్చాడు

ఏదో వచ్చి ముందడగటం, తరువాత వారంటు తేవటం, జరుగుతుందనుకున్నాడు గాని, సన్యాసి యింతమాత్రం ఊహించలేకపోయేడు వెంకన్న ఊళ్ళోలేడు వాకబుచేస్తే వారం రోజులు దాకా రాడని తెలిసింది ఈపట్టాలకి నాయుడువల్లు భగ్గుమంది అతడు మరి సహించలేక పోయాడు ఏడుపంతా కోపంలోకి పరివర్తన పొందింది ఈ ఎడ్లు మనవి కావని నిస్పృహ చేసుకున్నాడు వాకిట్లో నిల్చున్న పెద్దమనుష్యుల్ని ప్రక్కని మేస్తూన్న కోడెల జతని ఒక్కసారి చూసేడు ఈ అన్యాయానికి ప్రతీకారం చేయటం మానవాతీతం అనుకున్నాడు

ఉన్నట్టుండి చటాలున కోడెల దగ్గరకెళ్ళి కట్టుకొయ్యల పలుపులు విప్పి “తీసికెళ్ళవయ్యా! నువ్వేబతుకు!! ఎన్ని గొంతుకలు కోసావో కొయ్యి! పైని నేడా బగమంతుడు” అంటూ ఒక్క చరుపు చరిచేడు కోడెలువీపుమీద

ఇంతమందినీ చూసి ఆ గొడ్లు రెండూ బెదిరిపోయాయి ఒక్కదూకుదూకి ఓ కోడె రామన్ననీ మరొకటి బేటామీనుని మట్టేసి, అవతలకీ దాటేశాయి

# స్వతంత్రులమైన తరువాత

## మా యింటి బోగట్టాలు

నిజానికిదేం అంత చెప్పుకోదగ్గ విశేషంగాని వింతగాని కాదనే సంగతి నా అంతర్యానికి సుస్పష్టమే అయితేనేం చెప్పక తప్పదు మీకు వినక తప్పదు

దీనివల్ల ఏమన్నా పుణ్యంగాని పురుషార్థంగాని లభిస్తుందా? అని ఒకవేళ ప్రశ్నించేరు అల్లాంటి భావాలు అందరికీ అన్నింటిలోనూ అను విడా ఉంటాయి అనుకోవడంలోనే మీ పొరబాటని సాధనవి అసలు యీ వ్యాఖ్యానం అంతా కూడా అల్లాంటి పొరబాటుల్లోదే ఒక నమూనా అనికూడా అనేయడానికి సాహసిస్తున్నాను అస్తు

పాతికేళ్ళాయి నేను, - నేనేమిటి - మా యింటిల్లిపాదీన్నీ ఖద్దరు కట్టేం - కట్టించాం

అసలు సిసలు పక్కా ఖద్దరువాది కాంగ్రెసువాది మా నాన్నగారు అతడ్నిపని మానవలసిందని పెరటా వాకిటా పోరుపెట్టి పెట్టి, విసిగి, పగబట్టి, అయితే నేనూ ఖద్దరే కట్టి ఖైదులోకెళ్లి మాప్రతిష్ట పటాపంచలు చేస్తానని కాంగ్రెసులో చేరిన వ్యక్తి మాఅమ్మ

అమ్మా, నాన్నా యిద్దరు జైల్లోకెళ్లిపోతూ ఉంటే ఒదినగారికి పైపనిలో సహాయంచేసే తన ఆడబడుచు గౌరవ పదవికి భంగం కలిగించుకోవటం సుతరామూ యిష్టంలేక, దెబ్బలాడి వెళ్ళిపోవచ్చిన అత్తగారింటికి - స్వాతంత్ర ప్రియు

లైన తల్లిదండ్రుల కుమార్తె గాబట్టి - స్వేచ్ఛ చంపుకో వెళ్ళ డానికి మనస్కరించక, కాంగ్రెసు జెండాపట్టుకో పీధ్కుంది మా చెల్లి

ఓ! అంతా ఖద్దరుధారులే అంతా కాంగ్రెసు వాదులే అందరికీ ఒకేఒక వాంఛ - స్వాతంత్ర్యం

అత్తా, ఆడబొడ్డు అంత తప్పపోయిన తరువాత, యింటికి తనేగదా అధికారిణి ఆ గావం కాస్త నిలబెట్టు కోని యిల్లు తిప్పుకోకూడదూ నా భార్య ససేమిరా ఎవరికి లేనిదీ వంట వద్దింపుల అగవచారీ తనకేలా పట్టింది? తనూ కాంగ్రెసు లోనె చేరింది

అక్కడికి మిగిలిన అస్వతంతులుం నేనూ మా తమ్ముడే అవి ఆరోజులు ఆ స్వాతంత్ర్య పిపాన నేటికి తీరిం దనుకొన్నాను మొన్నట ఆగష్టు పదిహేనో తేదిగాను

ఇ తమంది నా సంబధీలు దేశసేవ చేస్తూన్నప్పుడు నా గర్వానికి అంతం అనేది ఉంటుందా? చెప్పండి! అయితే నేను మాత్రం జైలు కెళ్ళలేదు కారణముంది సుమండీ అంతా జైలు కెళ్ళిపోతే వెళ్ళినవాళ్ళ ఆస్తిపాసులు కాపాడే వాళ్ళెవరు? అంతా పల్లకీ ఎక్కితే మోసేవాళ్లో! అదే నా ఉద్యోగం?

ఈ విధంగా వైష్ణవ సాంప్రదాయ లా, దాసానుదాస పరంపరా రూపంలో నేనూ కాంగ్రెసు గోత్రీకుణ్ణే

అయితే మా అందిరిలోనూ కాంగ్రెసు పేరుమీాద నిజానికి తాను బాగుపడి తోటివాళ్ళని బాగుచేసినవాడు

మా తమ్ముడేను ఉన్నమాట అనాలిగదూ ఇప్పుడిప్పుడు కాంగ్రెసు అధికారం తెరవెనకాడుతూన భాగోతాలు వందిని వందీ పంచని నందీ చేసు మోసంతిప్పుతూన్న పెద్దరికాలు, అన్నీ మావాడు నాడే కనిపెట్టి సూత్రించి శిలాశాసనం చేసి, విడివిడిపెట్టిన విధానాలు

అవి దేశం బాగుపడాలనే ఉద్దేశ్యంతో ఒక ఘరానా కాంగ్రెసు కుటుంబంలో పుట్టిన వ్యక్తివల్ల నిర్మించబడిన వవటం వల్ల యిట్టేయిట్టే ఆసేతు శీతాచల మధ్యస్థులైన గాంధీటోపీ గాళ్ళందరినీ వరించాయి వరించడమేమిటి? నెత్తికెక్కి కూర్చున్నాయి-విడాకులిచ్చినా వదలవు

వాస్తవానికి మావాడావిధంగా తన బుద్ధిబలం ఉపయోగించబట్టే ఆ రోజుల్లో మేమిద్దరం ఇంటదగ్గర నిలిచి యిన్ని మెతుకులు తినగలిగాం

వర్తకులందరిక మావాడిమీద అభిమానమే వీడు పికిటింగుకెళ్తే చాలు వాళ్ళ బేరానికీ లోటులేదు కొనేవారి అవకాశానికీ లోటులేదు ఉభయతారా చేయిచాపిన మాకూ లోటులేదు

మొన్న పదిహేనో తేదీ మా యింటిల్లిపాదినీ వాంఛించిన స్వరాజ్యం—కాదు స్వాతంత్ర్యం—వచ్చిందని అశిరమ్మంత గొంతుకతో రేడియో చెప్పేసరిక నా ఆనందానికి మేరలేదు ఆ మర్నాటినుంచి ఏడుస్తూన్న ఏడుపుకి అంతం లేదు

ఈ స్వాతంత్ర్య సమయంలో నాబోటి ఏడ్పుమొఖాలికి తావులేదనే సంగతి తెలిసికూడా ఏడవవలసివస్తూంది అయితే

ఆ కారణాలేమిటనే జిజ్ఞాస మీలో కొందరికి—అంటేనాలాగే లోలోపున కుళ్ళికుళ్ళి ఏడుస్తూన్న వ్యక్తులకి ఉంటుందనే నమ్మకం నన్ను బాధిస్తూంది

స్వరాజ్యం రాగానే మానాన్న గవర్నరో లేక అంత మరింతవాడో అయిపోతాడనే ఆశ మొదట్లో మా మొఖాలు కొంచెం ముడుచుకొనేలా చేసింది నిజానికి హృదయపూర్వకంగా దేశానికి సేవచేసిన వ్యక్తి అతడేదా ! అతడు కాదు సరికదా, అతడు మాట్లాడేభాష తెలుగు మాట్లాడే ఏ ఒక్కరికి ఆ పదవి ప్రాప్తించకపోయేసరికి మా ఏడుపుకి సబబున్నదా లేదా ?

స్వరాజ్యం రాగానే, తన మొగుడు తన కాళ్ళదగ్గరికి వచ్చి, బ్రతిమాలి బహుమాలి నాల్గుచీరలు రెండు జతల రవికలు ఒకొత్త గాజుల జత పట్టుకొచ్చేస్తాడనే ఆశ మా చెల్లెలిది ఇంట్లో సం స్వాతంత్ర్యహక్కులు ఆడవాళ్ళనే అనే నమ్మకం ఆ ఆశకు దోహదం అది స్వప్నేపి జరక్కపోవడం ఆమెని క్రుంగదీసిందంటే తప్పా ?

స్వరాజ్యం రాగానే, ఏదంటబోయే ప్రతీవాడు కాంగ్రెసు టోపీకి నమస్కరిస్తాడనీ కాంగ్రెసువారంటే గౌరవిస్తారనీ అథమం రైల్లో టిక్కెట్టు అడగరనీ కాఫీ హోటల్లో స్వాతంత్ర్యం అంతా ఉపయోగించి తృప్తితీరా తినేసి తాగేసి తాగింపయ్యొచ్చునని ఊహాలుమీద ఊహాలు దొర్లించి అప్పుడు తీరుద్దామనే ఆశతో చేసిన అప్పుడు అప్పులు యిప్పుడు తీర్చలేక బాధపడే మా తమ్ముణ్ణిచూస్తే ఏడుపోస్తుందా ? నవ్వొస్తుందా ?

అన్నింటికీ మించిన బాధేమంటే నిన్నటిదాకా రోజూ వారీ బడికెళ్ళుతూన్న మా చిన్నవాడు యీవాళ స్వతంత్రుడై పోయి, మేస్టరుమీద తిరగబడుతున్నాడని యిప్పుడే విన్న వేడవేడి ఫిర్యాదుకి కళ్ళంట ముక్కుంటా కూడా నీళ్ళు కారక మానాయా ?

సరేసరి మా యింటావిడ ? ఇతఃపూర్వమే ఆమె స్వతంత్రురాలయింది ఇప్పుడు మరీని ఒకళ్ళెవరైనా వచ్చి అన్నం తినమ్మా అని చెబితే వారు చెప్పినమీదటే గాని తాను అన్నం తిన్నాదంటే అది భావదాస్యం అనే హెడ్డింగులోనే వస్తుందని అంత అన్యాత త్రింకంతో వస్తువడుకోవడం ఉత్తమం అని ఆమె పదహారణాల ఎత్తు నమ్మకం

ఇవన్నీ ఆలోచిస్తూ యిట్లో కాఫీగుండ లేదని లోపల నుంచీ కేకవేస్తే పోయి తెద్దామనే కోమటి వెంకన్న యింటికి వెళ్ళి అడిగితే అతడంటాడు గదా ! "బాబుగారూ యింట్లో వాళ్లు కాఫీగుండ తెమ్మంటే వాళ్ళమాటకు దాసులై మీరు యిల్లా బజారుకి బయల్దేడమేనా ధర్మం ! అందులో స్వతంత్ర భారతంలో ! నా మాట విని టీ పట్టుకెళ్ళండని టీ పొట్లాం యివ్వబోయాడు అసలు కిటుకు అతడి కొట్టుమీద ఆవేళ కాఫీ గుండ లేదు

నాకు యీ స్వాతంత్రం ఎందుకొచ్చిందా అనిపించింది

— — —

# మర్యాద

"శీతాపతీ"

"ప్రభూ"

'మనవద్ద ఉన్న కుక్కలెన్నో?"

"మొత్తం పదిహేనుంటాయి ప్రభూ"

"అయితే మన కందులో అవసరం ఎన్నంటావు?"

"చిత్తం ఇ చుమించు అన్నీ అవసరమే ప్రభూ?"

"ఛా! అన్నీ ఎందుకోయ్?"

"చిత్తం ఏమి శెలవు"

'గుర్రాలెన్నున్నాయి!'

"ఒక్కటే ప్రభూ?"

అయ్యో! దివాణం అంత హీనంగా ఉందా?"

"లేదు ప్రభూ! ప్రభువువారు కారు కొన్నాక గుర్రాలు అవసరం లేక గతించాయి"

"పోనీ అవి సహజంగా గతించాయా?"

"చిత్తం"

'ఇంకా ఏమేమి జంతువులున్నాయి?"

"రెండడవి పందులు ఓ కణుసు ఉన్నాయి ప్రభూ!

వాటినింకా ఎందుకు ఉంచావు?"

'చిత్తం వధించి వండించమని శెలవా? ప్రభూ!"

"ఛా! మనం మాంసం మానేశాం తెలుసా!"

"చిత్తం కారణం ఏమిటి ప్రభూ!"

"మనం ఇప్పుడు అహింసావాదులం"

"అవును కాని చిన్న సందేహం ప్రభూ ?"

"ఏమిటది ?"

'మరి మనకి తుపాకీ ఎందుకూ ? అని"

'ఏమి, అది ఆయుధం కదూ ?"

"అవును ప్రభూ ! అందుకే అది మనకెందుకా ? అని సంశయము !"

"ఏమి ? శిక్షించడానికి, రక్షించుకోడానికిన్నీ"

"ఎవరిని ప్రభూ శిక్షించడం"

"ఏమి ? మన మర్యాదాకి ఎదురు తిరిగి మనకు అవమానం కలిగించే వాళ్లెవళ్ళయినా శిక్షించవచ్చు కదూ!"!

చిత్తం కాని మన మర్యాదా యిప్పుడు రక్షింపబడుతూందా అని సంశయం !"

"ఏమి ?"

జమీందారీ పోయాక ఇంకా మనకు రాచమర్యాదలుంటాయా ప్రభూ !"

"జమీందారీకి మర్యాదకి సంబంధం ఏమి టోయ్ !"

'చిత్తం శ్రీ శ్రీ శ్రీ దేవగజపతి విక్రమాధిప మహారాజ బహద్దర్ అనే బిరుదావళి ఇంకా నిల్చి ఉంటుందా ప్రభూ"

"నహీఁనహీఁ అవన్నీ మరి ఉండవ్"

'అయితే మరి మర్యాదలేవి ప్రభూ ?"

"ఏమీ ! మనకీ మీసం లేదూ ?"

"అదికూడా సగమేకదా ప్రభూ నిల్చింది "

"దానికేం, పెంచేస్తా"

"అయితే తుపాకీ ఉండాలంటారా ? ప్రభూ "

"అవశ్యం ఉండవలసిందే !"

"అయితే విలాసంగా వేటాడవచ్చునా ?"

"ఎక్కడ వేటాడతాం ?"

'చిత్రం అదే తెలికుండా ఉంది ప్రభూ"

" ఈ చుట్టుప్రక్కల అరణ్యం అంతా మనదే కదోయ్'

అవును కాని మరి ప్రభుత్వం తీసుకొంటూందికదా? అందులో వేట చెయ్యనిస్తుదా ప్రభూ !"

"పోనీ, మనం యింట్లోనే విలాసానికి వేటాడుతుందాం'

'వేటని ప్రభూ !"

"ఏమిటా ! పదులున్నాయి అన్నావుకదూ !"

"అవి రెండేకదా ప్రభూ !"

'కణుజు ఉందన్నావు"

"చిత్రం మొత్తం మూడవుతాయి గుర్రాన్ని కలుపుతారా ప్రభూ!"

"ఆవశ్యం అదిమాత్రం ఎందుకూ మనకి?"

కుక్కలో "

'ఛా అవి వేట కుపకరిస్తాయికదోయ్?"

'ఏటిని వేటాడి ఏంచేస్తారు ప్రభూ "

' కలెక్టరుకి బహుమతీ పంపుదాం అతడు చాలా మర్యదా చేస్తాడు "

"చిత్తం ఓ ఒక్క నివేదామా ప్రభూ"

'అవును అదీ మంచి ఆలోచనె తప్పకుండా యిద్దాం"

"ఇరి మ ౧ కేం ఉంటుంది ప్రభూ"

"ఏమీా మన మర్యాదా మనకి చాలదోయ్"

చిత్తం చిన్న మనవి'

ఏమిటది వేగంకానీ'

మనక తూటాలు లేవు ప్రభూ"

ఏమి!'

"అప్పటా లైసెన్సుకి ద ఖాస్తు పెట్టలేదు"

'ఎంచేత!'

'ఏలినవారెన్నడు వేటాడలేదుకదా! అని"

'ఛా! ఇప్పుడు దరఖాస్తు పెడితే'

'ఇవ్వరేమో ప్రభూ !"

"ఎంచేత!"

'జమీందారీ మర్యాదకని యిచ్చిన తుపాకి లైసెన్సు జమీందారీ అస తరం ఎ దుకిసారు ప్రభూ!"

'అయితే ఏం చేద్దాం"

"అదే ప్రభూ ఆలోచించాలి"

"తుపాక లేకపోతే మర్యాదా లేదే!"

"చిత్తం ఏమి చేయమని శెలవు"

"ప్రభుత్వానికి వ్రాద్దాం"

'ఏమని ప్రభూ!"

"మాకు తుపాకి లైసెన్సు కావాలని"

"కారణం"

" టాడ్డానికి"
"ఎక్కడ్డో"
'మన ఇంట్లోనే"
"నిరాకరిస్తే?"
"జమీా వదలొద్దు"
'అది సాధ్యమా ప్రభూ!"
"ఏమీా, మనం రక్షించుకోలేమంటావా?"
'ఏ బలంతో ప్రభూ!"
తుపాకి!"
'దానికేకదా లైసెన్సు వర్భూ"
'అయితే ఆలాగే వ్రాద్దాం"
"ఏమని వర్భూ"

"మా జమీాందారీని మేం ఎంతమాత్రం వదలదలుచుకోలేదు కాబట్టి దాన్ని రక్షించుకునే నిమిత్తం ప్రభుత్వంవారు, మా మర్యాద గమనించి ముప్పైఏ తుపాకులకి లైసెన్సు అనుగ్రహించవలసిందని"

# సిగరెట్టు

'నశ్యం సభాపూజ్యం' అన్నారు ఋషులు, అసలీ ఋషులు చెప్పినదేమిటి అన్నీ వాళ్ళు తీరుబడిగా కూర్చొని అనేసినవే! అయితే యీ నస్యానికి ఇంత ప్రాధాన్యత ఎందుకిచ్చారూ అంటే, అదో చిదంబర రహస్యమట! అందులో ఎన్నో మహత్ శక్తులు నిబిడీకృతమై ఉన్నాయట! దాన్ని ఊపాసిస్తే ఇహపరాలు కరతలామలకాలేట!

సరే! ఇప్పుడా సోద నాకక్కర్లేదుగాని, సజాతీయమైన సిగరెట్టుకికూడా అలాంటి సభాపూజ్యత ఎందుకివ్వకూడదూ? అని నా ఆవేదన, చూజూస్తూ అత్యుత్తమమై, దేశంలో అధికసంఖ్యాకుల ఆదరణకి పాత్రమై, సర్వావస్థాసన్నిహితమై, సర్వవ్యాప్తమైన యీ 'సిగరెట్టు'ని యిలా నికృష్టంగా అగౌరవంగా, చూడటం అనేది ఈ యిరవైయో శతాబ్దంలో ఖాత్రిగా నాగరికతకే గొడ్డలి పెట్టువంటిదని నా అభిప్రాయం

అసలీ రోజుల్లో - ఏ రోజుల్లోనైనా అంతే అనుకోండి - గౌరవం, ప్రతిష్ట పదవి సభాపూజ్యత వగైరా వగైరాలన్నీ కావాలంటే కావలిస్తే యోగ్యతలు ఒకటి, దేశంలో అందరితోటి ముఖ్యంగా మేం పెద్దవాళ్ళం అని అనిపించుకొన్న వాళ్ళతో పరిచయం రెండవది పేరు చెప్పేసరికి, అందరికీ ఏదో ఎక్కడో ఏ పత్రికలోనో అథవా రేడియోలోనో విన్నట్టుండాలి, మూడవది, దేశంలో ఉన్న జనాభాలో అధిక సంఖ్యాకుల ఆదరణానికి పాత్రత లభించాలి నాల్గోది ఏదో

ఓ ప్రముఖమైన పార్టీకి చెందిఉండి, లేదా చెందిఉండినట్టుగా నైనా కనీసం నటించి, ఆ పార్టీ ప్రతిష్టకి త్యాగం చెయ్యాలి అయిదోది ఎలక పట్టుకో మీద కీడ్వగలిగే వ్యక్తినో, వ్యక్తు లనో ఆశ్రయించి హామేషా వారికి కొక మోస్తూ యీ వళ్ళు నాది కాదనే భావం నలుగురూ తెలుసుకొనే లా ప్రద ర్శించాలి ఆరోది, సబబున్నా బేసబబున్నా సమయమైనా అసమయమైనా కావలసినా అక్కర్లేకపోయినా, నేనీ హిందూ ప్రాచీన సంస్కృతికి పాటుపడుతున్నాననీ నా యావజ్జీవితం హైందవ సాంప్రదాయానికి ధారపోస్తాననీ, నేనీ అవసవ్యంగా ఉన్న సంఘాన్ని అమాంతంగా మరామత్తు చేస్తానని, నేనీ స్వతంత్ర భారతానికి ఆర్థిక రాజకీయ ధార్మిక సామాజిక వ్యవస్థల్లో పునాదులు వేస్తానని నోరూ నొప్పెట్టేలా ఎక్కడ బడితే అక్కడే ప్రేలాలి ఏవంగుణ విశేషణ విశిష్టుడైన ఏ వ్యక్తి అయినా సరే, ఇట్టే యిట్టే చూస్తూ ఉండగానే, యిల్లంటుకొన్నప్పటి మంటల్లాగ, పైకెగబాకుతూ మహా నాయకుడై, మంత్రి అయి, మహారాజై కూర్చుంటాడు

అయితే, ఈ యోగ్యతలన్నీ అక్షరాలా 'సిగరెట్టు'కి జన్మతః సిద్ధించి ఉన్నాయి అటువంటి సమయంలో దాన్ని అలా తిరస్కరించి, దానిమీద ఓ సభలో నిషేధపత్రం అమలు జరిపించి, దానికో అస్పృశ్యతవంటి మహాదోషాన్ని ఆపాదించి, దాని తలమీద జిజియాలాటి పన్ను బిగించి, దాన్ని సమూలం దగ్ధంచెయ్యడం అనే హృదయ విహీను లైనవారి పని అని నా అభిప్రాయం

వస్త్యానికి ఏ ముడిపదార్థాలు ప్రాతిపదికలో అవే దీనికి ప్రాతిపదికలు, కాగా నాగరీతం అనేది దీనికి నాగరికతాచిహ్నం అనికూడా గుండెమీద చెయ్యివేసుకొని ధీమాగా చెప్పొచ్చు దేశంలో ఎందరో దీన్ని అస్వాదిస్తారు కనుక దీనికి అధిక సంఖ్యాకుల ఆదరణ పార్టీబలం అన్నీ ఉన్నాయి కదా! కాంగ్రెసుగద్దెమీద కూర్చొని గొలుసు కట్టుగా సిగరెట్లు వెలిగించే "అజాదు"వంటి ప్రముఖుడైన వ్యక్తి నిది ఆశ్రయించి నప్పుడు పైకెత్తేవాడు లేడనే బెంగ ఉండనక్కర్లేదు కదా! నిత్యాగ్నిహోత్రానికి ప్రతినిధిగా ఉంటూన్నందున మన ప్రాచీన సంస్కృతిని నిలబెట్టుతున్నా నిలబెట్టగలదని గాఢా విశ్వసించడా ఎకిసందేహం లేదుకదా!! డబ్బున్న వాడికో ఖరీదుకి డబ్బులేని నాలాంటి అభాగ్యపు తెలుగు రచయితకి ఖరీదుకి దొరుకుతూ అందర్నీ సంతృప్తి పరచగల్గుతూన్నందున దేశంలో ఆర్థిక వ్యవస్థకూడా అమూల్యమయిన సేవచేస్తున్నదని అనుకో వచ్చుగదా! ఎప్పుడూ పొగాకుపార్టీకే చెందిఉండి, నాగరికత పెమ్పుపెరిగి చుట్టకాల్చడం అసభ్యత అని అనుకొన్న వాళ్ళని తమ పక్షానికి త్రిప్పుకొనేందుకుగానూ యత్కించిత్ వేషం మార్చి ప్రత్యక్షమయి వారందరిచేత ఆమోదింపబడి ఆస్వాదింపబడి, పార్టీయొక్క యశోధికాభివృద్ధికి పాటు బడ్డందున, దీనికి పార్టీ రాజకీయాలు విశేషంగా తెలుసునను కోవడానికి వేరే సబబు, సాక్ష్యం, అక్కరలేదు గదా!! అస్తు

ఇన్ని గుణాలున్నప్పుడు దీనికి సభాపూజ్యత ఎందుకుండ రాదో చెప్పండి అయితే అక్కడక్కడ సభాధ్యక్షులు

(కాంగ్రెసులోలాగ) సభికులు కొంచెం కొంచెం దీనికి సభా సమారాధనలో ఆపాటి గౌరవం ఇస్తున్నారనుకోండి కాని బళ్లో పాఠం చెప్పే మేష్టరు, చదువుకొనే విద్యార్థి గుళ్లో దీపం పెట్టే అర్చకుడు ఆరాధించే భక్తుడు కూడా దీన్ని యథావకాశంగా గౌరవించడం అనేది వచ్చిననాడుగాని దేశం బాగు పడదేమో అని నా భయం

దీని కొక్కటే మార్గం అమాంతంగా రేపు శాసన సభలో సిగరెట్టుమీద అస్పృశ్యత నిషేధం, వగైరాలన్నీ తొలగించబడ్డాయని అట్టివి శాసన రూపంగా ద్రోహాలనీ శిక్షార్హాలనీ ఒక చట్టం చేసి పారేస్తే అప్పుడు మన దేశాన్ని ఇంతగా ఉద్ధరించి మన్నించి ముందుకు తెచ్చి నాగరికత వ్యాపింపజేసి మన సంస్కృతిని కాపాడిన సిగరెట్టుపట్ల మన ఋణ విముక్తుల మవుతాం అలా వేసే వారికే రేపు ఓటువేద్దాం

— —✕— —

# తరుణోపాయం!

అప్పన్న కానాడల్లా నిద్రపట్టలేదు కష్టించి పండించిన గరిశెడు గింజల్లోనూ కరణం చెప్పిన మాటలు చూస్తే - ఎవ్వడైనా యింట్లో ఒంపేట్లు కనపడలేదు తనూ పదిమంది పిల్లలు యీ పేటికేడల్లా మలమలమాడిపోవటం తలచుకుంటే గుండె క్రుంగిపోతూంది ఏదో ఐది పదిహేను గరిశెలు పండి పై వూరినుంచి నాలుగు ఒళ్ళు అంబారీవచ్చి యింట్లో నిరుటిసరుకు నిలువవున్న రామినాయుడంటివాళ్ళు పందుమో పుట్టెడో సర్కారు కిచ్చేరంటే తనెట్లా ఇవ్వగలడు ఇరవై గరిశెల ధాన్యం ఇట్లో నింపుకున్న నాయుడు దగ్గరా పది పుట్లే వసూలుచేసి, గరిశెడు గింజలు రాల్చిన తనదగ్గరా పదిపుట్లే వసూలు చేస తీరతాననటం కరణాని కేం ధర్మం! ఊళ్ళో ప్రజల ఉసురోసుకోవటం వీళ్ళకేమి జయమో!!

"అప్పన్నా, అప్పన్నా" అంటూ వినిపించింది ఏదో బొంగురుగొంతుక వీధిలోనుంచి

దిగాలుగా, రాబోయే సంవత్సరాన్నెట్లా గడపటం యిప్పటి అవస్థ నెలా తరించడం అని ఆలోచనలమీద ఆలోచనలు సాగిస్తూ కుక్కి మంచంమీద క్రుంగిపోయి కూర్చున్న అప్పన్న యీ కేకవిని మరింత క్రుంగిపోయాడు ఈ కేక అతనికి చిరపరిచితమైనదే ఏటా యిదే మామూలు గింజలింటికొచ్చేయి అనేసరికి వీధిలో రేవిణీవేసి పిలుస్తూవుంటాడు షావుకారు సన్యాసయ్య తన బాకీ వసూలు చేసుకునేందుకు గాను కాబూలీవాడిని మించిపోయి అవతరిస్తాడా రోజున

"అప్పన్నా, అప్పన్నా" యీసారి గొంతుక మరింత గట్టిగా దీర్ఘంగా కూడా వినవచ్చింది అప్పన్న మరి నిలవలేక పోయాడు ఎదురుగుండా వెళ్ళి మాట్లాడడానికి శక్తికూడా చాలలేదు ఈ అపాయం తప్పే ఉపాయంకూడా అతడికి తోచ లేదు కూర్చున్నవ్యక్తి లేచి నిలబడ్డాడు, మంచంకోటిదగ్గర నిల్వవుంచిన చుట్టపీ తీసి చేతితోపట్టుకోని, దుప్పటి వయిమీద వేసి వీధి గుమ్మంవైపు మొఖం త్రిప్పాడు కాళ్లు రాలేదు

"అప్పన్నా! ఏలెవళ్ళా పలకరేంటి! ఇంట్లో ఉన్నట్టా! చచ్చినట్టా!" గాండ్రించాడు సన్యాసయ్య ఇల్లంతా ప్రతిధ్వ నించింది అవే శబ్దాలు నిద్రలో వున్నవాడు వులిక్కిపడి లేచి నట్లు లేచి చక్కావచ్చాడు అప్పన్న వీధిలో నిల్చున్న సావు కారు సమీపానికి

"ఏం! అప్పన్నా మీ కదునుకి అప్పివ్వడం కాకుండా మీ గుమ్మంలదగ్గర గంటలకొద్దీ మాకీ నలువుజీతాలేటోయ్ గింజలు నీ యింట్లోకి నాల్గురోజులాయె వచ్చాయికదా యీ పాటికి కొలిచి పంపిస్తే మేమిలా వస్తామా మీయింటిచుట్టూ తిరుగుతూ కూర్చుంటే మా కవతల పనులేమవుతాయో కొంచె మైనా జ్ఞానం ఉండొద్దూ" అని అతి దీర్ఘంగా తన కష్టసుఖాలు కూడా కలిపి వర్ణించడం మొదలెట్టాడు సెట్టి

అసలుసంగతి సావుగారికి అప్పన్న అయిదు రూపా యీలు బాకీ ఆ బాకీకి వడ్డీక్రింద ఏటా, మూడుపుట్లు కొలు స్తున్నా ఇంకా వడ్డే మిగులున్నాదని, అది అసలులో కలుపు తున్నానని ఈ రీతిగా గడుపులు పెంచి, తనకి అప్పన్న యావ జ్జీవిత ఆర్థిక ఒడంబడిక ఒకటి సృష్టించాడు సావుకారు ఆతని

అతి చాకచక్యంవల్ల ఆ లెక్క నేర్పువల్ల అయిదు రూపాయాలతో ప్రారంభించిన ఆ బాకీ నేటికి ఎనభైఅయిదు రూపాయాలని తేలింది ఏ ఏటేటా వడ్డీక్రింద జమకట్టే గింజలు పుట్టెడో వందుమో పెరుగుతూన్నప్పటికే, ఈ అసలు వృద్ధులు ఎందుకిలా పెరుగుతున్నాయో అప్పన్నకి జన్మలో బోధపడని రహస్యం అదేమో తెలుసుకుందామని జిజ్ఞాసకూడా అతడికి లేదు

"ఈ సంవత్సరం వడ్డీక్రింద పదిహేను పుట్లు రావాలోయ్" అన్నాడు షావుకారు 'పదిహేనా?' అన్నాడు అప్పన్న నిలువునా క్రుంగిపోతూనూ "సెట్టి! కరణం ఓప్రక్కనుంచీ పదిపుట్లు సర్కారుకివ్వాలని పీక్కున్నాడు నువ్వూ బాధిస్తే మరెలాగ చెప్పండి? ఓ అయిదు పుట్లు తక్కెళ్ళి కొంచెం కొంచెం కటాచ్చిస్తే నీపేరు చెప్పుకొని చల్లలింత గంజనీరు త్రాగుతారు" అన్నాడు అప్పన్న

కావలసినంతా గలభా జరగేక లాభనష్టాలు బేరీజులు వేసినాక, పదిమందీ పోగయి సలహాలిచ్చిన వెనుక ఎలాగో సెట్టి రాజీకిదిగి పదిపుట్లు కొలిపించికొని, మిగిలిన అయిదు పుట్లకి ధరకట్టి అసలులో చేర్పించి క్రొత్తనోటు వ్రాయించుకొని యింటిమొఖం పట్టాడు

"యీ పది యిలా పోయాయి కరణంగారి పదిపుట్లు తీసుకొన్నాడో, మిగిలిన పదిపుట్లు చాకలి, మంగలి, వడ్రంగి వాళ్ళ జీతాలికిచ్చేస్తే యిట్లో యీసాలుకి సాలూ పస్తులు పడి చావవలసిందేనా భగవంతుడా! వది దారి? ఎవరూరుకుంటారు? అని కళ్ళంట నీళ్లు నింపుకొంటూ, పుట్టెడు దిగులుతో మళ్ళీ కుక్కిమంచంమీద కూలబడ్డాడు అప్పన్న

ఆ మర్నాడు ఊరంతా హడావుడిగానే వుంది ఊళ్ళోకి గవర్నమెంటు అధికార్లు, వచ్చారనే వార్త యిట్టేయిట్టే చావుకబురులా ఊరల్లా వ్యాపించింది కరణంగారి అరుగు మీద జరుగుతూన్న తతంగానికి అంతు లేదు కరణంగారి అనుయాయులు ఆడుతూన్న తెరవెనక భాగోతానికి మరుగు లేదూ! ధాన్యం కొలిపించుకొందామని వచ్చిన అధికార్ల దృష్టి గింజల మీదకంటె గింగురుధ్వనులు వినిపించే నాణెంమీదికి ప్రసరిస్తున్నాయి ఎక్కువగా వచ్చినవారంతా జేబులు ఎక్కువగా కుట్టించినవారే!

పది పదిహేను గరిసెలు పండిన మోతుబరీ నాయిళ్ళ ఏవన్నా ఏదో పాత్రకో ముడుపు చెల్లించి పంపుమో ఫ్రుట్టైడో సర్కారిక కళ్ళు తుడుపుజేసే కరణానికో కాగితం పారేసి వాళ్ళ దగ్గరాని, వాళ్ళవాళ్ళ దగ్గిరాని గింజ అనేది మరి లేదనిపించేసుకున్నారు

బస్తాలకి బస్తాలు బాకీల క్రింద, వడ్డీల క్రింద బేరాల క్రింద వసూలుజేసి నిలవ్వేసిన షావుకారు సన్యాసయ్య ఏభై రూపాయిలు నాది కావనుకొనేసరికి తిండికి లేని బోడి సన్నాసి క్రింద గవర్నమెంటు లెక్కల్లో నమోదు అయిపోయాడు

వచ్చిన అధికార్లు కాఫీ టిఫిన్లు బాగా ఆరగించి జేబులు నింపుకున్నప్పటికీ, లోకానికి చూసేందుకో గరిసెడైనా ఆ వూరినుంచి పట్టుకెళ్ళాలనే పట్టుదల పట్టడం చిన్నరైతుల పీక మీదకి వచ్చింది

కరణంగారు, దండాసి వెంకడు మరో నలుగురు రైతులు, అయిదుగురు ఆఫీసర్లు అంతా దండయాత్రకి బయల్దేరినట్లు బయ

ద్రేరారు ఇంటింటికన్నీ వాళ్ళ దృష్టిలో ఆ వూరులో పెంకు
టిల్లు లేదు ఉన్నవాళ్ళు ప్రక్కకి పోనక్కరలేదు వూరి పాక
ల్లోనే వాళ్ళ ప్రాక్ట్యార్ మెటు

"ఇంతమందినీ మాస అప్పన్న బెంబేలెత్తిపోయాడు
వాస్తవంగా తనకివండిన గింజ గరిసెలే అయినా అది సర్కారు
లెక్కలో కరణంగారి ధర్మమా అని, ~ల్లు గరిసె క్రింద
నమోదు అయింది పదిపుట్లు విధిగా కొలిచి తీరాలనే పట్టు
పట్టారు అధికార్లు

'అప్పన్నా' అని కొంచెం దూరంగా పిలిచేడు దండాసి
వెంకడు 'నా మాటని ఓ రెండు ఒస్తాలు పెరటతన్న కర
ణానికి పంపిస్తూ, ఒక్క పందుంతో నీ ఎవ్వారం తేల్చేలా
నాను సూత్తాను అని సలహా యిచ్చాడు

అప్పటికదే తరుణోపాయం అని అప్పన్న యింటో
కెళ్ళాడు బస్తా ఒటుపంపి యిటొచ్చేసరికి ఏం జరిగిందోగాని
వాకిట్లో ఒక్కపురుగు లేదు మధ్యాహ్నం దండాసి వెంకన్న
వచ్చి సర్కారుకిచ్చే పందుము తన కస్పీ ఓ పందుమూ కొలి
పించేసుకున్నాడు

ఆదిలో లతాధికారి అతను మరి, అప్పు డేమిచేశాడో
యెరుగుదువా ? ఒక్కమాటు అలాగా యిలాగా పారజూ
శాడు ఎటు చూసినా ప్రతీచేలోనూ కొండల్లాగ వరికుప్పలు
కొన్ని కుప్పలు రైతులు నూరుస్తున్నారు ఇంకేం, వారి కన
పడిం దతనికి"

"ధాన్యం అడిగి తెచ్చుకున్నాడా, ఆ పూటకి"

"ఛీ, ఛీ ఒకళ్ళకిస్తాడు గానీ, దేహీ అని కోమటిబిడ్డ వొకళ్ళని దేవరిస్తాడా? అతను వర్తకం చేశాడని చెప్పాను కాదూ?"

"ఏమి వర్తకమూ?"

"వరకమన్న వర్తకమా? గాలి పోగుచేశాడు, దీపాలు పెట్టేటప్పటికి మళ్లీ వొక యింటి వా డయిపోయాడు"

"ఇలా చెప్ప మా అమ్మ, మళ్ళీ అందుకుంది"

"ఊరివాళ్లు పగిలిపోయిన కుండ లన్నీ ఆ చెరువుగట్టున పారేస్తారు ఆ కుప్పలోనుంచి వొక పెద్ద పెంకు తీశాడతను గట్టున పడివుండిన మూడు మట్టిబెడ్డలు తెచ్చి పొయ్యి అమర్చాడు ఆ చెట్టూ యీ చెట్టూ యెక్కి యెండు చితుకులు విరిచి గుట్టలుపెట్టాడు ఒక కువ్వ నూర్పుడు దగ్గిరికి వెళ్ళి నిప్పు తీసుకువచ్చాడు. అతని పెళ్ళాం పెంకు కడిగి నిప్పు రాజేసింది అతను నిశ్చింతగా వూళ్ళోకి బయలు దేరాడు"

"బియ్యం కోసమా?"

"కాదు వర్తకం చెయ్యటానికి నాన్నా"

"మరి డబ్బే దమ్మా?"

'చెప్పాను కాదూ తండ్రీ? బుద్ధి వుంటే డబ్బెందుకూ? మనవాళ్ళు వర్తకం చేస్తే వున్నదికూడా వూడ్చుకుపోతుంది కోమట్లు వర్తకం చేస్తే లేనిది పుట్టుకువస్తుంది"

"ఇలా అని, మా అమ్మ నాకళ్లల్లోకి చూసింది నేను ప్రతిభుణ్ణయి వున్నాను అది గమనించి మా అమ్మ మళ్ళీ కథ అందుకుంది"

“తిన్నగా అతను వూళ్ళోకి వెళ్ళాడు ఊరంతా కాప జనం, అంతా వ్యవసాయదారులు, ధాన్యం గుట్టలూ, కొండలూ అయి మూలుగుతూ వుంటుంది వారి దగ్గిర ఊరంతా ప్రతీ వీధీ తిరిగా డతను ’

“తిరిగి?”

“పేలాలోయి పేలాలు, వేడివేడి పేలాలు, వింత వింత పేలాలు, కమ్మకమ్మని పేలాలు కరకరలాడే పేలాలు” అంటూ కేక పెట్టా డతను చుట్టూ మూగి పిల్లలు “పేలా లేవి” అనడిగారు “చెరువు గట్టున వున్నాయి వెళ్లం” డన్నా డతను “వడ్లకి సగం బియ్యానికి సరిక సం” అని కూడా చెప్పా డతను

“ఆగు, ఆగు, నాకు తెలిసిపోయింది రహస్యం, పిల్లలు తెచ్చిన వడ్లే పేలాలుచేసి యిచ్చింది అతని పెళ్ళాం, బియ్యం అన్నం వండింది ”

“అంతేనా మరి? గంట గంటకీ లే గా డతను వీధివీధికీ తిరిగాడు మళ్ళీ మళ్ళీ వచ్చి పిల్లలు పేలాలు కొనుక్కున్నారు చీకటి పడాటప్పటికి కుంచెడు బియ్యం చేరాయి నాలుగు కుంచాల వడ్లు మిగిలాయి ’

# ఇంగ్లీషు పీడ

తనంటే తలమునిగిన పనిమీద బయలుదేరాడుగాని యీ ఉన్నవాళ్ళందరికీ ఏం పనులు పడ్డాయి ? అని అనుకున్నాడు కొండయ్య ప్లాటుఫారంమీద జనాన్ని చూసి. ఇటుంచటు, అటుంచిటు ఊసుబోక తిరగడమేగాని, యీ కూడిన జనసమూహాం అంతటికీ పన్లే ఉండవు యిదో ఫేషను రైల్లో ప్రయాణం చేస్తే నలుగుర్నీ చూడొచ్చు అంతే లాగుంది వీళ్ళలో చాలామంది ఊహ అని ఊహించేడు

'దిక్కుమాలిన బుకింగుక్లార్కు, కిటికీ దగ్గర నలిగి చచ్చాడన్న సంగతేనా గమనించకుండా, అవతల కొంపమునిగి పోయిన తర్వాత అవసరంమీద వెళుతున్నానన్నాయ్యా అని చెప్పినా వినకుండా అమాయకుణ్ణన్న అభిమానమేనా చూపకుండా చిల్లరెగ్గొట్టేశాడు ఆ సందటిలో చిల్లరేమిటట ! టిక్కట్టు దొరకడమే అబ్బురమట ! రైలు ప్లాటుఫారంలోకి వచ్చేదాకా నసిగి నసిగి 'బండొచ్చింది పోవయ్యా' అని కిటికీ మూసేడుగదా 'ఈ పాపిష్టిమ్మడి నేంజేస్తే పాపంఉంది' అని గొణుక్కుంటూ రైలును సమీపించేడు

రైలు కిటకిటలాడుతూంది ఇసకవేస్తే రాలదు రైలివతల ఎక్కబోయే వాళ్ళెందరో రైల్లో ఉన్నవాళ్ళు యింతకి రెట్టింపున్నట్టుంది కొంత ఊపిరేనా బాహాటంగా తీసుకునే అవకాశం చాలా పెట్టెల్లో లేనట్టుంది

కొండయ్యచేతిలో దైవవశాత్తు సామానేమీ లేదు ఆ వెధవస్టేషనులో అర నిమిషంకంటే ఎక్కువసేపు ఆగదు

బండి హడావిడిగా యీ పెట్టెకాదని ఆ పెట్టె, అదికాదని యిది యీ చివరనుండి ఆ చివరిదాకా ఆ అరనిమిషంలోన అధమం ఆరుసార్లుఅయినా ప్రేగులు తెంపుకో పరుగెత్తాడు కొండయ్య ఏ పెట్టెచూసినా ఒక్కలాగే ఉంది ఎందులో ఎక్కడం ఎక్కితే పోనీ నిలబడే ఉండొచ్చు కూచుంటానని తనేం పట్టుదల పట్టేడా ? అసలు ఎక్కనిస్తేగా రైల్లో ఉన్న వాళ్ళు తలుపుదగ్గర చేరి లోపలనుంచి తలుపు తెరవడానికి వీల్లేకుండా దమాయించి 'యింకో పెట్టె చూసుకో' అని ముక్తకంఠంతో కేకవేస్తూ ఉంటే ఎట్లా చావను !

'మరి లాభంలేదుకాబోలు దేవుడా' అనుకున్నాడు కొండయ్య ఏంచేసో కాళ్ళు నిలబడిపోయాయి మతిబోయి వట్టయింది

'ఏం బాబయ్యా, రై లెక్కించా లేటండి' అన్నాడో దుక్కలాంటి మనిషి

హఠాత్తుగా ఆహ్వానితుడుగా వచ్చి సహాయం చేస్తా నంటూన్న యీ వ్యక్తిని చూసి తెల్లబోయాడు కొండయ్య "ఏం ఎక్కడ జాగా వుందేమిటోయ్ ?" అన్నాడు.

'జాగా ఏమిటిబాబూ తమకు తెలవదా' చూత్తుండాలుగా మోసు ఓ రూపాయి యిలా పారెయ్యండి ఎలాగో మిమ్మల్ని రెల్లోదింపేత్తా' అన్నాడు మహామోటుగా ఉంది ఆమనిషి సంగతి వాడికి రూపాయి కూలియిస్తె ఏకేటుకీలోంచో సామాను తోసినట్లు మనిషిని అమాంతంగా రైల్లో మనుష్యుల నెత్తిమీదికి గిరవాటేస్తాడు అందుకు తగ్గ జబ్బపుష్టి ఉపాయం, సాహసం వగైరా సద్గుణశ్రీలన్నీ వాడికబ్బేయి

ఆ విధంగా చేతులు కాళ్లు కలియగట్టించుకో పిప్పళ్లి బస్తాలా రైల్లో దిగుమతీ అవడం కొండయ్యకి నచ్చలేదు అసలు యీ వెధవకి రూపాయి ఎవడిస్తాడని కూడా అనుకున్నాడు. లోలోపల

తన పెట్టెదగ్గరికి వెళ్తున్నాడు గార్డు గీగులునోట్లో పెట్టుకొని సిగ్నలిచ్చేసేడు కొండయ్యకి కళ్ళు చీకట్లు గ్రమ్మినట్లగయ్యేయ్ కాళ్ళు చేతులు వణుకుతున్నాయి ఓ ప్రక్కనుంచి ఏడుపుకూడా వస్తూంది అవతల అయిదువందల రూపాయీల దావా గంగపాలైయిందను కున్నాడు

మళ్లా రైలువేపు చూశాడు తను నిల్చున్న చోట ఓ సెకండు క్లాసుపెట్టె ఉంది ఏమయితే అయింది యిందులో ఎక్కిపోతే! అనుకున్నాడు ఛటాలున పెట్టె దగ్గరికి వెళ్లాడు

పెట్టెలో ముగ్గురే ఉన్నారు ఇద్దరు పడుకున్నారు ఒకడు వాళ కి కాపలా కూర్చున్నాడు సూటు బూటువేసి నెక్టయిపెట్టి ధీమాగా కూర్చుని ఉన్న ఆ పెద్దమనిషి, 'జౌకేక్ డిబ్బాహై జావో' అంటున్నాడు కొండయ్యతో

తలుపుతోసేడు కొండయ్య అతని మాటలు విని పించుకోకుండాను లోపలనుంచి కాలు దమాయించి తలుపు అడ్డేస్తున్నాడు కూర్చున్న వ్యక్తి యివతలనుంచీ గుంజా యిస్తాడు కొండయ్య అవతలనించి అటకాయిస్తాడు సూటు వాలా మరిలాం లేదని దమాయించేడు కొండయ్య డాబు చేశాడు ప్రార్థించేడు ఏడుపుమొగంకూడా పెట్టి బతిమా లాడు

ఆ లోనున్నవ్యక్తి మనిషో కామోగాని కొండయ్య మాటలు వాడికి వినిపించినట్టు లేదు. ఎంతసేపు ఎన్ని చెప్పినా 'జా కే' డబ్బా అనే అంటాడు. దిక్కుమాలిన డబ్బా. ఇంతలో జాగా దొరకని మరో నలుగురు ప్రయాణీకులు కూడా ఆ పెట్టెకే వచ్చారు.

కొండయ్యకిప్పుడు పార్టీబలం ఎక్కువయింది. అయిదుగురు కలసి అమాంతంగా తలుపు వెనక్కి నెట్టారు. ఎలాగైతేనేం లోపల ప్రవేశించారు. రైలు కదిలింది.

ఇంతసేపు హిందీలో మాట్లాడిన వ్యక్తి రైలు కదిలిన తర్వాత తెలుగులోకి దిగేడు 'మళ్ళా స్టేషనులో మరెవ్వరిని రానివ్వకండి, యిది సెకెండుక్లాసు పెట్టె' అన్నాడు. అందరూ ఏకీభవించారు. రైలివతల నిలబడి ఉండి అనుభవించిన యావత్తు నరకం రైల్లోపడేటప్పటికి మరిచిపోయాడు కొండయ్య కూడాను.

కొండయ్యతోపాటు రైలెక్కిన నలుగురూ నిలబడే ఉన్నారు. కొండయ్యమాత్రం సూటువాలా ప్రక్కనే మెల్లిగా వర్కాయించి కూర్చున్నాడు. పడుకొన్న వ్యక్తులు యింత గలాభా జరిగినా, అదేం నిద్దరో వత్తిగిల్లనైనా లేదు. ఎంత సుఖ నిద్రో అనుకున్నాడు కొండయ్య.

ప్రక్కమనిషితో సంభాషణ ప్రారంభించి మరికొంచెం జాగా సంపాయిద్దామనే కాంక్ష బయల్దేరేసరికి, తనకి వచ్చిన కాస్త యింగ్లీషు ఉపయోగిస్తూ బాతాఖానీ ప్రారంభించేడు కొండయ్య.

'వేరాఫార్ ఆరు యు గోయింగ్' అన్నాడు. కాని సూటువాలా మాట్లాడలేదు. పడుకున్నవాళ్ళలో ఒకణ్ణి లేపి

ఏదో హిందీలో మాట్లాడుతున్నాడు వినిపించుకోన్నట్టులేదు కొండయ్యకి మహాకోపం వచ్చింది ఏమిటీ పొగరు అను కున్నాడు మళ్ళీమళ్ళీ ప్రశ్నించేడు విధిలేక చివరకి 'మెడ్రాస్' అన్న అమృతపు తునకల్లాంటి మాటలు ఆ సూటువాలానోటింట దిగుబడి అయ్యాయి

మీా దేవూరు ? ఏం చేస్తున్నారు ? ఎందుకు మెడ్రాస్ వెళ్లుతున్నారు ? వగయిరా ప్రశ్న పరంపర ప్రారంభించేడు కొండయ్య మళ్ళా జవాబివ్వడం మానేశాడు సూటువాలా వీడికేం పోగాలమా ! అనుకున్నాడు కొండయ్య

'ఆప్ ఆరామ్‌కీ జియే ! అంటూ ఉన్నట్టుండి గభీమని తను కూర్చున్న స్థలం కాళీచేసి లేచిపోయాడు సూటువాలా కొండయ్యకి వింతచర్య అర్థంకాలేదు అడిగినదానికి జవాబు చెప్పనంత మూర్ఖత్వం ఏమిటి ? యిప్పుడీ జాగాయిచ్చి లేచి పోవడం ఏమిటి ? అనుకున్నాడు తను అనవసరంగా నిందించేరా పాపం ! అతని మంచితనమేనా కనిపెట్టకుండా అని లోలోపల తన్ని తనే దూషించుకొన్నాడు సూటువాలా మొహమాటం మీాద ఎలాగైతేనేం యిద్దరిజాగా తనే ఆక్రమించి విశ్రమించేడు కొండయ్య

తరువాత స్టేషన్లలో, పాపం, కొండయ్య సూటువాలా కింత టీ ఇప్పించేడు దోస్తీ చేశాడు తెలుగులో మాట్లాడేడు

తను దిగిపోతూ ఉంటే చెప్పేడు సూట్‌వాలా 'మీా యింగ్లీషు పీడ వదిలించుకొందుకే మీాకు జాగాయిచ్చి నేను లేచిపోయాను' అని కొండయ్య తెల్లబోయాడు యితని కింగ్లీషు రాదా ! లేక మాటాడ్డం ఫేషనుకాదా అని